# వెన్నెల తెరచాప -
# నారాయణరెడ్డి

రచన :
కళాప్రపూర్ణ
రావూరు వేంకట సత్యనారాయణరావు

ప్రచురణ :
**వంశీ ఆర్ట్ థియేటర్స్**
న్యూనల్లకుంట, హైదరాబాదు - 500 044.
(ఫోన్ నెం. 61001)

VENNELA TERACHAPA
Narayana Reddy

వెన్నెల తెరచాప — నారాయణరెడ్డి

ప్రథమ ముద్రణ 1000

ప్రచురణ : 1981



ముఖచిత్రం :
శీలా వీర్రాజు

ముఖచిత్ర ముద్రణ :
నందిని ప్రింటర్స్,
నారాయణగూడ, హైదరాబాదు

ముద్రణ :
స్నేహలతా ప్రింటర్స్,
కాచిగూడ, హైదరాబాదు

ప్రతులకు :
దేశి బుక్ హౌస్,
నారాయణగూడ, హైదరాబాదు

నవయుగ బుక్ హౌస్,
సుల్తాన్‌బజార్, హైదరాబాదు

న్యూ స్టూడెంట్స్ బుక్ హౌస్,
విజయవాడ

నవోదయ బుక్ హౌస్,
విజయవాడ.

వెల రూ. **10-00**



అఖిలాంధ్ర ప్రజాకోటి హృదయాలలో కోటి దివ్వెలు వెలిగించి, పేదసాదల బ్రతుకుల్లో పసిడి పంటలు పండించి—

పరిపాలనాదక్షులూ, ప్రజా బంధువూ, దయాసింధువూ, కార్యశీలి అనే బిరుదులు సంపాదించి—

కళలకు, గానానికి, అవిరళవితరణ నందించి—

నాయకోత్తములుగా భాసిస్తున్న, చలువ చంద్రునివలె ప్రకాశిస్తున్న, రాష్ట్రప్రగతిని సాధిస్తున్న

మన ముఖ్యమంత్రి, గౌరవనీయులు

# శ్రీ టి. అంజయ్యగారికి

ఈ చిన్ని పొత్తాన్ని కానుకగా అందిస్తున్నాను.

రావూరు వేంకట సత్యనారాయణరావు

# వెన్నెల తెరచాప "ఒక భావగీతం"

శ్రీ ఇ. అయ్యపురెడ్డి
న్యాయశాఖామాత్యులు

శ్రీ నారాయణరెడ్డిగారి సాహిత్యాన్ని, వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించే రేఖా చిత్రమే "వెన్నెల తెరచాప".

ఆరు కోట్ల ఆంధ్రులకు ఆత్మీయుడైన ఒక మహాకవిని అభివర్ణించడం అంత తేలిక పని కాదు. ఆయన కవిత్వ తత్త్వాన్ని ఆవిష్కరించి అద్దంలో చూపడం కూడా గురుతరమైనదే.

కాని ఈ "వెన్నెల తెరచాప" సహజ సుందరమైన సరళ శైలిలో హాయిగా పాడిన మధుర గేయంలా సాగిపోతుంది.

నారాయణరెడ్డిగారి వ్యక్తిత్వంలోని, కవిత్వంలోని మధురాత్మను అవ్యక్తంగా సన్నిహితం చేయడంలో సంపూర్ణమైన విజయాన్ని సాధించింది.

"చివురాకులో కవిత
చిరుమొగ్గలో కవిత
చిరుగాలిలో కవిత
చిలకరించేదెవరో ?"

ఇదే శైలిలో సాగుతుంది "వెన్నెల తెరచాప". కావ్యవస్తువుకు తగ్గ కవితావేశంతో వ్రాసిన భావగీతం. తెలుగు నేతకు అంజయ్యగారికి కానుకగా అందించడం సముచితం.

అర్ధశతాబ్ది జన్మదినోత్సవ కానుక, ఈ "వెన్నెల తెరచాప"ను రచించిన కళాప్రపూర్ణ శ్రీ రావూరు వేంకట సత్యనారాయణరావుగారిని, వారి కృషిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

# వెన్నెల...

వెన్నెల పద ప్రయోగం వినగానే వెంటనే డా. రావూరు స్ఫురిస్తారు. వారికే, "వెన్నెల"కు వున్న సంబంధమేమిటో కాని, "వంశీ" సంస్థకు ఆయన వెన్నెల. ఆయన పరిచయం తర్వాత వంశీ సంస్థ ద్వారా, రాయప్రోలు వారి సాహిత్య సౌందర్య దర్శనం, మనపట్టాభి, ప్రచురించి ఎంతో పేరు సంపాదించాము.

నారాయణరెడ్డిగారంటే రావూరువారికి అమిత గౌరవం, ఆప్యాయత. రెడ్డిగారి 50వ జన్మదినోత్సవం చేయాలనుకుంటున్నామని రావూరు వారికి చెప్పటం జరిగింది. వెంటనే "వెన్నెల" చోటుచేసుకోటమే కాకుండా, "వెన్నెల తెరచాప నారాయణరెడ్డి" అనే మకుటం వారి నోటి నుంచి వెలువడింది. రావూరు వారిలా ప్రోత్సాహం ఇచ్చే వారుంటే ఎంత పెద్ద కార్యక్రమమైనా సునాయాసంగా చేయగల సమర్థత నాకుంది ! అందులో నేను తలపెట్టిన డా. సి. నారాయణరెడ్డిగారి 50వ జన్మదినోత్సవం సామాన్యమైన విషయం కాదు. ఒక రకమైన చారిత్రాత్మక, ప్రతిష్టాకరమైన కార్యక్రమం. "వెన్నెల తెరచాప – నారాయణరెడ్డి" త్వరగా వ్రాయటం మొదలు పెట్టండి అన్నాను రావూరుగారితో. ఆయన కొంచెం అస్వస్థతగా వున్నారు. ఈ మాట వినగానే వారికి ఉత్సాహం వచ్చి, మరుసటి రోజు నుంచి రంగంలోకి దిగారు.

ఇంతా చేస్తున్నాం ! నారాయణరెడ్డిగారు షికాగో సభలకు వెళ్ళారు, వచ్చింతర్వాత ఇవన్నీ నాకొద్దంటే ? అనుమానం ! మే 18న వెళ్ళిన రెడ్డిగారు జులై 8 న తిరిగి వచ్చారు. విషయం చెప్పాను.

"అన్ని ఏర్పాట్లు చేసింతర్వాత, వద్దంటే ఆగుతారా ? కాని" అన్నారు రెడ్డిగారు.

ఇది రావూరు "వంశీ"కి ప్రసాదించిన "మరో వెన్నెల". వారు డాక్టర్ సి. నారాయణరెడ్డిగారికి ప్రసాదించిన పగలే వెన్నెల, ఈ మహాసభలకు అధ్యక్షులుగా దొరికిన శ్రీ అయ్యపురెడ్డిగారు వంశీకి మరో వెన్నెల, ఈ పుస్తకాన్ని కానుకగా అందుకుంటున్న ముఖ్యమంత్రిగారికి జీవితమంతా వెన్నెల కాగలదని ఆశిస్తూ—

19—7—1981,
హైద్రాబాద్.

వంశీ రామరాజు
ప్రధాన కార్యదర్శి

# నందివర్ధనాలు

వంశీ థియేటర్స్‌వారు డాక్టర్ నారాయణరెడ్డిగారి 50వ జన్మదినోత్సవం జరుపబోతున్న సందర్భంలో వారిని గురించి ఒక గ్రంథం వేయాలనుకున్నాం అది మీరు వ్రాయాలని అడిగారు. ఒక కవిని గురించి ఒక గ్రంథం వెలువడటం మంచి సాంప్రదాయం. ఆ కవి వ్రాసిన కవిత వెనుక దాగి వుండే భావాలను ఏరి మాలకట్టడంలో ఎంతో సొగసుంది. కవిని వ్యక్తిగా, శక్తిగా చూడగలగడంలో ఎంతో శిల్పంవుంది. – ఈ వుద్దేశ్యంతో నేను గ్రంథ రచనకు పూనుకున్నాను.

కాని ప్రారంభించిన తరువాత రెడ్డిగారిని గురించి గాని, వారి ప్రతిభను గురించి గాని, వారి కవిత్వ పటుత్వాన్ని గురించి గాని సంపూర్ణంగా వ్రాయడం సాధ్యంకాని పనిగా తోచింది. అయినా తెలిసినంతవరకు విన్నంతవరకు కొన్ని వివరాలు యిందులో పొందుపరిచాను – కోసిన పువ్వులుగా. ఇది నాకు లభ్యమైన వివరణ మాత్రమే అవుతుంది. వెన్నెట్లో చలువరాతి మీద నందివర్ధనాలు పరిచి నట్లుగా కొన్ని శీర్షికలు పరిచాను. నా ఉబలాటాన్ని గ్రహించండి – లోటులను విస్మరించండి.

ఈ గ్రంథాన్ని అంకితం తీసుకోటానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, పరి పాలనాదక్షులు, కళాభిమానులు, గౌరవనీయులైన శ్రీ టి. అంజయ్యగారు అంగీక రించినందుకు వారికి నా హార్దిక అభివందనలు –

ఈ రచనకు ప్రోత్సహించిన వంశీ థియేటర్స్ వారికి, మూలాన్ని తయారు చేయటంలో సహకరించిన డా. వాసా ప్రభావతి, చి. టి. లక్ష్మీనాగేశ్వరరావు, శ్రీమతి ఎ. కరుణాదేవి గారలకు కృతజ్ఞతలు.

డా॥ 'రావూరు'

# కీర్తి త్రిమూర్తి

—జె. బాపురెడ్డి

నారాయణరెడ్డి గారికి నాకు ముప్పైఏళ్ళ స్నేహం. ఆయన వ్యక్తిత్వం పట్ల, సాహిత్యం పట్ల దినదినం గౌరవం పెంచుకొని ఆనందించే మిత్రుల్లో నేనొకణ్ణి. ఆయనా, నేనూ ఒకే జిల్లాకు చెందిన వాళ్ళం కావటం, మా పూర్వీకులు ఆయన స్వగ్రామానికి చెందినవాళ్ళై కావటం నాకెంతో గర్వకారణం. నాటి తెలంగాణా రచయితల సంఘ ఉద్యమంలో, సమైక్యాంధ్ర ఉద్యమంలో, నేటి ప్రపంచ తెలుగు ఉద్యమంలోనూ ఆయనా నేనూ ఒకే మార్గానువర్తులం కావటం నాకెంతో సంతృప్తిని కలిగిస్తుంటుంది.

డా॥ నారాయణరెడ్డిగారు పుట్టగానే పరిమళించిన పూవు. ఆధునిక తెలుగు సాహిత్యంలో వెన్నెలవాడలు, కర్పూర వసంతాలు, నాగార్జున సాగరాలు సృష్టించి, భావవిప్లవ విశ్వనాథుడై, ప్రగతి ఋతుచక్రధారియై, రాగరహో విశ్వంభరకు జన రసహృదయాన్ని భూమిక చేసిన కీర్తి త్రిమూర్తి ఆయన. పద్మశ్రీ, కళాప్రపూర్ణాది బిరుదులందుకున్న ఆయన సాహిత్య సరస్వతి ప్రజ్ఞాన పీఠం మీద నోబెల్ శోభావతియై అనంతానందనాద ఘోషవతియై విరాజిల్లాలని ఆశిస్తున్నాను.

వంశీవారు మహాకవి నారాయణరెడ్డికి చేస్తున్న 50 వ జన్మదిన సన్మానానికి ఈ ''వెన్నెల తెరచాప'' వన్నెల కిరీటంలా భాసిస్తున్నది. కళాప్రపూర్ణులు రాపూరు వారు సి. నా. రె. అపూర్వ భావసాగర చైత్రయాత్రకు అమర్చిన వెన్నెల తెరచాప ఇది. తీయని తెలుగు శీర్షికలతో ముద్దుల వెలుగు మూటలు కట్టి దారిబత్తెంగా అందించారు రాపూరు. భాషపై భావంపై ప్రత్యేక అధికారం సంపాదించిన ఆచార్య నారాయణరెడ్డి అధికారభాషోద్యమ భావాన్ని ఆబాలగోపాలానికి ఆమోద యోగ్యం చేస్తూ, తన విచిత్ర పవిత్ర సాహిత్యయాత్ర సాగిస్తూ విశ్వాంతర వీధుల్లో క్రొత్త వెలుగులు పండించాలని ఆకాంక్షిద్దాం.

# ప్రభవలలో పరుగులు

[రెడ్డిగారి జననం ప్రజోత్పత్తి నామసంవత్సరం. అప్పటినుంచీ ఇప్పటి వరకూ వారి జీవితంలోని ఘట్టాలను సంవత్సర వారీగా ఇక్కడ పేర్కొన్నాను]

1. ప్రజోత్పత్తి — జననం.
2. అంగీరస — ప్రాకులాట.
3. శ్రీముఖ — తప్పటడుగులు.
4. భవ — బుడిబుడి నడకలు.
5. యువ — వడివడి నడకలు.
6. ధాత — సరస్వతీ నమస్తుభ్యం.
7. ఈశ్వర — వరదే కామరూపిణి.
8 బహుధాన్య — విద్యారంభం కరిష్యామి.
9. ప్రమాది — సిద్ధిర్భవతు మేసదా.
10. విక్రమ — పద్మపత్రవిశాలాక్షి.
11. వృష — పాణిగ్రహణం.
12. చిత్రభాను — సిరిసిల్లాలో చదువు.
13. స్వభాను — తెలుగుతనంలో లీపి.
14. తారణ — సిరిసిల్లాకు వీడ్కోలు.
15. పార్థివ — కరీంనగర్ చదువు.
16. వ్యయ — కవనానికి నాంది.
17. సర్వజిత్తు — హైస్కూలుకు వీడ్కోలు.
18. సర్వధారి — కాలేజీ ప్రవేశం.
19. విరోధి — ఇంటర్ పరీక్ష.
20. వికృతి — డిగ్రీ కోర్సులో ప్రవేశం
21. ఖర — పట్టభద్రుడు.
22. నందన — కవితా విజృంభణ.
23. విజయ — నవ్వని పువ్వు ప్రచురణ.
24. జయ — ఉర్దూ పాండిత్యం.

25. మన్మథ — తండ్రి హోదా.
26. దుర్ముఖి — అధ్యాపకులు.
27. హేవళంబి — కావ్యరచన.
28. విళంబి — కవితా ప్రచారం.
29. వికారి — యువ కవి గౌరవం.
30. శార్వరి — ఘన సన్మానాలు.
31. ప్లవ — ఫిలిం పాటల రచన.
32. శుభకృతు — డాక్టరేటు.
33. శోభకృతు — రీడర్ పదవి.
34. క్రోధి — రాష్ట్ర ఎకాడమీ బహుమానం.
35. విశ్వావసు — జాతీయ కవి.
36. పరాభవ — ఫిలిం ఖ్యాతి.
37. ప్లవంగ — కావ్య ప్రీతి.
38. కీలక — వెన్నెల మెట్లు.
39. సౌమ్య — కీర్తి కిరీటం
40. సాధారణ — అసాధారణ ప్రతిభ.
41. విరోధికృతు — గేయ సింధువు.
42. పరీధావి — సాహితీ బంధువు.
43. ప్రమాదీచ — కేంద్ర ఎకాడమీ బహుమతి.
44. ఆనంద — "గేయ భగీరథ" బిరుదు. (భాషా కుటీరం)
45. రాక్షస — మీరట్ విశ్వవిద్యాలయంలో డి. లిట్ బిరుద ప్రదానం.
46. నల — ఆచార్య పదవి.
47. పింగళ — పద్మశ్రీ బిరుద ప్రదానం.
48. కాళయుక్తి — కళాప్రపూర్ణ బిరుద ప్రదానం.
49. సిద్ధార్థి — రష్యా పర్యటన.
50. రౌద్రి — విశ్వంభర మహాకావ్య రచన.
— మలేషియా పర్యటన.
51. దుర్మతి — తెలుగు మహాసభల సందర్భంగా మలేషియా పర్యటన. ఉత్తర అమెరికా సమితి పక్షాన అమెరికా పర్యటన. ఆంధ్ర సాంస్కృతిక సంస్థ పక్షాన బ్రిటనులో సంచారం. హైదరాబాదులో యాభయ్యవ జన్మదినోత్సవ సందర్భంగా ఘన సన్మానం.

ఎంత చల్లని తల్లి
ఎదనిండ పొత్తిళ్ళు
ఎంత కమ్మని తావి
పువుతోట పురిటిల్లు

# ఎదలో పొత్తిళ్లు

---

ఆ తల్లి ఒత్తిగిల్లి పొత్తిళ్ళలో పాపడికి తొలిసారిగా క్షీరదానం చేసింది. క్షీరంలో అక్షయ సంపదలు, అక్షర సంపదలు నిండి వున్నాయి తొలిసారిగా ఉగ్గు గిన్నెతో ఉంగ పెట్టింది. ఆ ఉంగలో బంగారు చిరుగంటలు మ్రోగినాయి. ప్రేమగా ముంగురులు సవరించింది. ఆ సవరింపులో మెత్తని జుట్టు వుంగరాలుగా మెలిసినాయి. కొనగోటితో అలనల్లన పెదవి తాకింది. ఆ పెదవి మీద చిరకాలం నిలిచే నవ్వు పువ్వులు విరిసినాయి ఆలవోకగా బిడ్డను ఎదకు హత్తుకుంది పసివాని గుండెలలో వెలుగుదారాలు కందెలుగా చుట్టుకున్నాయి. చిగురాకులాంటి పాప అరచేతిని చీరకొంగు అంచుతో తుడిచింది. ఆ చేతిలో కనిపించని కలం వచ్చి నిలిచింది. చెంగుతో అలనల్లన విసిరింది ఆ విసురులో కవనాల పవనాలు మెల్ల మెల్లగా వీచినాయి. బిడ్డను మనసారా ఆశీర్వదించింది. ఆ ఆశీర్వాదమే అనంత శక్తిగా రూపొందింది. తన కడుపులో పాపడు తన కలలముందు సాక్షాత్కరించడం చూచి ఆనందించింది. ఆ ఆనందమే ఆమె మనసును నందనోద్యాన వనంగా మార్చింది.

ఆ పూల తావులు పురిటి గది నిండి యింటినిండా ప్రాకటానికి పరుగులు తీస్తున్నాయి. ఆ తల్లి మనసులోగల బలంతో బయటికి కూడ దూకటానికి ప్రయత్నిస్తున్నాయి. పురిటిగది గుమ్మంలో కిలకిలలు. పసివానికి ముందు ముందు ఆడుకోవడానికందించే గిలక్కాయలను జ్ఞాపకం చేస్తున్నాయి. ఆ కిలకిలలు. వాటి కంటె హెచ్చు స్థాయిలో వినిపించినాయి-పకపకలు. అవి తండ్రి పకపకలు. మగవాడు జన్మించి నాడనగానే ఒక కొత్తయుగాన్ని కల్పించికొన్నట్లు, జగత్తునంతా జయించ పోతున్నట్లున్నాయా పకపకలు. ఆ చూపులు పురిటి మంచంవైపు

పరుగులు తీసినాయి. మంచం చుట్టు వలయాలై తిరిగినాయి. కొద్ది సేపటికి వాటంతటవే దోమ తెరగా అల్లుకున్నాయి. ఆ తల్లి భర్తకు తన ఓపికలోని నవ్వుల పువ్వులను దోసిట పోసింది. ఆమె మనసుతో మూగ రాగాలు విరిసినవి. రాగ రంజితమైన హృదయంలో రాగాలకు కొదువ లేదు. బిడ్డడు జన్మించినపుడు తల్లి తన ఆనందాన్ని వర్ణించ లేక ఉక్కిరి బిక్కిరి కావడం సహజం. ఆ సమయంలో తల్లి కవయిత్రి అయినా, గాయకురాలయినా పెదవి కదపలేదు. మూగతనమే శరణ్యము. పాపడు రవంత పెరుగుతున్నప్పుడు రాగం పెరుగుతుంది అను రాగంలో అనంతమైన రాగాలు, అంతులేని భోగాలు, అసామాన్యమైన త్యాగాలు. తల్లి హృదయంలో ఆత్యంతాలు ముడి వేసుకొనేది - తన సంతానాన్ని చూసి మురిసి పోయేటప్పుడే.

తొలినాటి తలపులన్నీ కలలుగానే గోచరిస్తాయి ఆ పురిటి గది దివిగా సాక్షాత్కరిస్తుంది. అది ఇల అని గ్రహించేటప్పటికి తనయుడు తప్పటడుగులు వేస్తూవుంటాడు. పెదవుల చప్పుళ్లు తల్లిని పలకరిస్తువుంటాయి. తల్లి దండ్రుల హృదయాలలో పూర్ణత గోచరిస్తుంది. తనయుడు మేటివాడైతే వారు కళాపరి పూర్ణులవుతారు. బిడ్డలను కని పెంచుటలో తల్లి దండ్రులు ప్రదర్శించే అభినివేశం ఆనందం వర్ణించరానిది. ఈ సంరక్షణ సృష్టికి ప్రతి సృష్టి. హృదయాలకు తృప్తి ప్రాణుకులకు పరిపుష్టి. ఇంతకు మించిన కళాభినివేశము వేరొకటి ఏమివుంటుంది ? చక్కని సంతానంగల తలిదండ్రుల జీవితాలలో విలసిల్లె కళాప్రపూర్ణత్వాన్ని మించిన సంపద ఏమున్నది ?

కరీంనగర్ జిల్లా హనుమాజీపేటలో ఒక సంపన్న గృహంలో వున్నది పైన చెప్పిన పురిటిగది. కన్నతల్లి శ్రీమతి బుచ్చమ్మ. కన్నతండ్రి శ్రీ మల్లారెడ్డి. వారింటిపేరు సింగిరెడ్డి. ఆ పసివాని పేరు నారాయణరెడ్డి.

అతడు జన్మించింది ప్రజోత్పత్తి నామ సంవత్సరంలో. మాసం ఆషాఢం, అది పూర్ణిమ. వట్టి పూర్ణిమ కాదు గురు పూర్ణిమ.

ఎదను విల్లనగ్రోపి
ఏమేమి పలుకునో
కదిలి మెదిలే కలము
ఏమేమి చిలుకునో –

## 'పసిడి రథం'

---

నిరంతరం ఎదలో సంవదిచేసే స్పందన కవితకు మాతృక. ప్రతి స్పందన నుంచీ లావిగల పుష్పొకటి పూచి వికసిస్తుంది. ఆ పూల మాలిక కవిత. స్పందనను అందుకోగలవాడే కవి. సామాన్యుడు వాటిని చిందర వందర చేసుకుంటాడు. ఏ కవి స్పందన ఆ కవిది. మూలశక్తి ఒకటైనా ప్రతిభావ్యుత్పత్తులను బట్టి కవితకు వన్నె వస్తుంది కవి వాసికెక్కుతాడు ఆ కవి జీవిత ప్రాంగణమంతా వెన్నెల తోరణా లల్లుకుంటాయి. కవిత ఒక ఆరాధన. స్పందన వస్తువును, గుణాన్ని అపరంజి పళ్లెంలో వుంచి అందించే కళామతల్లి. స్పందనలో నుంచి కవిత, కవితలో నుంచి కీర్తి, కీర్తి నుంచి హారతి. ఒక కవి యశస్సు గడించి జీవిత యాత్ర సాగిస్తు న్నప్పుడు పసిడి స్యందనం మీద వూరేగుతున్నట్లుంటుంది.

నారాయణరెడ్డిగారి స్పందన చాలాకాలం క్రిందటనే ఆయనను పసిడి రథం మీద కూర్చొబెట్టి ఆధునికాంధ్ర సాహిత్య వీధులలో వూరేగించింది. ఆ ఉత్సాహంలో ఆయన ఉత్సుకత కొరవడలేదు. ఆ జైత్ర యాత్రలో ఆయన గాత్రం మూగపోలేదు. ఇంకా సలువరాణిని ఆరాధిస్తూనే వున్నారు. ప్రతిభను త్రుంచి సాహిత్య లోకానికి పంచిపెడుతూనే వున్నారు.

చూడగానే కవిగా కనిపిస్తారు నారాయణరెడ్డి. నడకలో నవ్వులో అప్పు డప్పుడు నటుడిగా గోచరిస్తారు. కాని అతడు ముమ్మూర్తులా కవి. తను మురిసి యితరులను మురిపించడానికి యత్నించే కవి. కవి ఎవరో తెలుసుకున్న కవి. ప్రజలెవరో గ్రహించిన కవి. తన విధ్యుక్త ధర్మాన్ని తను గుర్తించిన కవి. అతని మనసు మెత్తన. అతని గుండెలు కొండలై వాటినుండి పురికి పరుగులెత్తే

సెలయేళ్ళ గలగలలను కలాని కందించగల కవి. అతడు కాలము వెంట నడుస్తూ తన వెంట పాఠకులెలా నడుస్తున్నారో గమనించి తలవంచి, పయనించే బాటసారి. అందువల్లనే యే ఒడుదుడుకులు లేని జీవితం. గదవిడలు లేని ప్రసంగం. చిడి ముడులు లేని నుదురు. గడులు లేని హృదయం. అంపెలు లేని ఆప్యాయత - ఇవన్నీ ఆయన సొత్తు.

చక్కగా పలుకరించ గలరు మూడు మాటలతో ముచ్చట వెలువరించ గలరు. చిన్ని వెండి పూల సజ్జలో రంగు రంగుల పూలు నింపుకొని సభారంగానికి వస్తారు. సుకుమారంగా, సుతారంగా ఒక్కొక్క పువ్వే విసురుతారు చివరి పువ్వు విసిరి కొసరినట్లుగా ఒక చిరునవ్వు నవ్వి ముగిస్తారు. ఇంత పండితుడు, వాక్చాతు ర్యము గలవాడు, సభామర్యాద నెరిగినవాడు, సంభాషించే వస్తువు నెరిగినవాడు ఇంత చిన్న సజ్జతో రావటమేమిటి ? అని సభికులు అనుకుంటూ వుంటారు అందుకే ఆయన ఎక్కడ ప్రసంగించినా పరుగెత్తాలనిపించటం. ఎన్ని మాట్లు వేసినా విసు గెత్తదు, మొహం మొత్తదు.

ఆయన గంభీరుడుగా కనిపించాలని ప్రయత్నిస్తారు. కాని సభాలున తన హృదయాన్ని గుమ్మరిస్తారు. దాన్ని దాయలేరు. కృతజ్ఞతలను విస్మరించలేరు. అనుబంధాలను ఎట్టి పరిస్థితులలోను వదులుకోలేరు. ఆయన పలకరింపు ఒక పాట. 'ఓహో ! మీరా !' అనడంలో ఎంతో ఆప్యాయతవుంది. ఆ ఓహో మనదగ్గర నుంచి వెళ్లె పల్లకీ బోయల "కోకోము" పాట దూరంనుంచి వినిపించేటట్లుగా చెవికి అందుతూనే వుంటుంది. పలకరింపులో ఆప్యాయతను గిలకరించినపుడు, గౌరవాన్ని చిలకరించినపుడు, ఎదను రంగరించినపుడు అది చక్కని సంగీత స్వరంగా మారి పోతుంది. ఆ పలకరింపు సరసంతో కూడినదైతే అది ఒక కావ్యంగా రూపొందు తుంది. అది మరచిపోని పలకరింపుగా మిగులుతుంది.

సహజంగా ఆయనలో ఒక రీవి వుంది. దానిని తపలంపచేసుకుంటూ వుంటారు. చిరాదు కొమ్మ పువ్వుగా భాసించాలనుకుంటారు. కాని అందరికీ అందుతూనే వుంటారు. విసుగులేదు. కసురులేదు. తీరిక లేకపోయినా సహజత్వం విడువడ మనేది లేదు. నలువరాణి తనకందించిన పవిత్ర కార్యక్రమాన్ని నిర్వహించుటలో క్రొత్త క్రొత్త ఫణుతులు, పల్లవులు ఏరుకోవటం, చరణాలు సమకూర్చటం గేయాల్ని

ఒక నాయికగా రూపొందించటం ఆయనచేతుల అపూర్వ శిల్పాలు, దీనికి దోహద మయ్యే ప్రతిభ అనల్పం. అందువల్లనే నారాయణరెడ్డిగారి పేరు నానాటికీ పెరుగుతోంది ఆయనపైన కీర్తి కన్య వయ్యారంగా వాలుతున్నది చెక్కిట చిటికవేసి చిలిపిగా నవ్వుతోంది. ఆ చిటికెతో గుండెలో కోటి చిరుజ్యోతులు వెలుగుతున్నాయి. ఒకజ్యోతి ఒక గీతిగా రూపొందుతోంది.

గుడిదారి వెంబడిపోవు
జడదారి యెవరు?
బడిదారిం పరిగెత్తు
బాలకుం డెవరు ?

# 'ఎద ప్రయాగ'

---

తెల్లవారింది రెండు బారల పొద్దు పైకెక్కింది. రైతులు పొలాలకు బయలుదేరివెళుతున్నారు. ఎవరి పొలం వారికి పుణ్యతీర్థం అందుకే రైతు జీవితంతో అంత పరమార్థం తొంగిచూస్తుంది దారిలో ఒక ప్రక్కగా చిన్న బడి వుంది. కొద్దిమంది పిల్లగాండ్రు మాత్రం బడికి వెళుతున్నారు. తండ్రులు పంట పొలాలకు వెళుతూ బిడ్డల్ని పంతుళ్ల దగ్గర దింపిపోతున్నారు. "చక్కగా చెప్పండి బాబూ ! డొక్కలో నాలుగు ముక్కలు పడేయండి. మేము చెక్కలు దున్నుక బ్రతుకుతున్నాము. మా వాడైనా యీ బురద వదలి పట్టణానికి చేరాలి" అని చెప్పుకుంటున్నారు. పంట రైతు కావలసిన పిల్లలు కొందరు పండితులు కావడానికి ప్రాతిపదికలు వేసుకుంటున్నారు. అలా తండ్రి బడి దగ్గర దింపిపోయిన వారిలో ఒకడు బాలనారాయణరెడ్డి.

తొలినాడు పలకమీద "అ, ఆ" లు దిద్దిన శుభముహూర్త మెట్టిదోగాని ఆనాడే అక్షర సంపద అతని గుండెల్లో కుప్పలు పడి వుంటుంది ఏదో ఒక అదృశ్యహస్తం కాశ్మీరశాలువా కప్పి వుంటుంది. అతని బలపం కలంగా మారటానికి ఎంతో తొందరపడి వుంటుంది. అతని కలం కవనాలు గిలకరించడానికి గిలగిలలాడి వుంటుంది. అతడు సిరిసిల్లా చేరాడు పై చదువు కోసం. అప్పటికే అతడు ఒక యింటివాడయ్యాడు. తరువాత కరీంనగర్‌లో చదువు. అక్కడ కవనానికి నాందిగీతం పలికాడు. ఏవేవో కవనాలు గిలుకుతూ వుండేవాడు. ఎవరెవరికో వినిపించి విసిగిస్తూ వుండేవాడు. ఆ విసిగిన వారికేమి తెలుసు ఆంధ్ర దేశమంతటా యెందరెందరో అతని కవిత వినటానికి ఏనుగు చెవులు చేసుకుంటారని ! ఆ కవితలో తీపిని చప్పరించటానికి ఆ చెవులే డొప్పలుగా

మారతాయని ఎవరనుకుంటారు. అతను సినిమాలలో వ్రాసిన పాటలు వినటానికి జనం విరగబడతారని - కుర్చీలు విరగతన్నుతారని , కవి వినేవారికోసం వెతుక్కొనుట సహజం కాంతామణులకు వారు వండిన వంటలు ఒకరు తిని లొట్టలు వేసినపుడే సంతోషం. కవికి తన రచన ఒకరు విని రొట్టిపెట్టమెదలు ఊచినపుడే సంతోషం. అట్లాంటి మెదలకోసం నారాయణరెడ్డి వెతుక్కొన్నారట. ఎన్నికల సమయంలో ఎలుగెత్తి పాటలు పాడారట. ఆవేశం అతనికి తక్కువ కాదు. దానికి అనువుగా గొంతెత్తి పాడారు కొంత ఎత్తు ఎదిగారు. కవిగా గ్రామాలలో పేరు వచ్చింది. "హనుమాజీపేట" కుర్రవాడని అందరూ చెప్పుకున్నారు తల్లిదండ్రులు ఎంతో మురిసుకొన్నారు.

పై చదువుకు ఆయన భాగ్యనగరం చేరారు కవితారంగంలో అంతకు ముందే అడుగుపెట్టారు కనక ఆయనకు కొంత గుర్తింపు వచ్చింది. దానికితోడుగా తెలంగాణా ఉద్యమం ప్రారంభమైన తరువాత అక్కడి కవులందరి గొంతుకలు ఒయ్యాలైనాయి. ఆవేశంతో రోషం మేళవించింది. కవితలో జాతీయత చొచ్చుకు పోయింది. పరపీడనను ఎదుర్కొని చల్లటినీడను కల్పించుకోవాలనే ఆసక్తి కలిగింది. నారాయణరెడ్డి గుండె రగిలింది. గొంతు పెగిలింది. అప్పుడు శ్రీ దాశరథి జంటగా నిలిచాడు. వారి నుండి కోటి గీతాలు వెలిసినవి. విన్నవారి కనుల నుండి ఆనందాశ్రువులు కురిసినాయి. ఆనాటి వారి కవితలు ఆ ఓకటి మాగాణిలో చిరుదీపాలు వెలిగించాయి. ఉద్యమాలు సంస్థలను, దేశాన్ని కాపాడుతూ వుంటాయి. ఆ ఉద్యమాల వెనుక నిలిచే వ్యక్తులు నిజంగా దేవతామూర్తులే. ఆనాడు తెలంగాణా ఒకరిచేత అగ్నివీణ మీటించింది. ఒకరిచేత పసిడి శంఖం పూరింపజేసింది. వారిద్దరు దేశభక్తులయినారు. జాతీయ కవులైనారు. ఆ యుగ వైతాళికులైనారు. దేశంలో చీకటి వెలిసింది. వెన్నెల కురిసింది. అందరి కవులలో యీ అన్నదమ్ములు ప్రత్యేకించి నిలిచారు. అందుకే నారాయణరెడ్డిగారు అంటూ వుంటారు "నేను దాశరధికి ఎప్పుడూ సౌమిత్రినే" అని. రెడ్డిగారిలో కవనాలు పండిన పండగ రోజుల్లోనే కడుపుకూడ పండింది కవితా సరస్వతీ, పుత్రిక జాహ్నవీ కలిసి ఆయన గుండెలలో పరుగు తీశారు. తరువాత సరస్వతీ యమునలు వచ్చి చేరాయి. అతని యిల్లు "త్రివేణి"గా మారినది. అవును మొవటాప ప్రయాగే —

గుడిలోని దీపాలు
గుంపుగా మెరిసె
భక్తులా దోసిటా
కెంపులై కురిసె

# పట్టు గొడుగు

---

భారత జాతి నివసించేది ఒక పవిత్ర ఆలయంలో. ఎందరెందరో దేవుళ్లు చుట్టూ వున్న సముద్రాలే ఆ దేవుళ్ళకు అందిస్తాయి యేటికోళ్లు. ప్రాలేయ శిఖరాన సూర్యకిరణాలు ప్రసరించి పర్వతమంతా ప్రాకులాడే వేళ పరమశివుడు నృత్య ఖేలనలో మునిగి వుంటాడు. కన్యాకుమారిలో కాత్యాయనీ దేవి కుంకుమ రంగు చీర ధరించి కురులు సవరించుకొని, ముద్దుగా ముడుచుకొని, తిలకందిద్దు కుంటూ వుంటుంది. ఇంతలో ఢమరుక ధ్వని వినిపిస్తుంది. ఆమె చూపులు కైలాసం వైపు పరుగు తీస్తాయి. ఆయన మనసు హిమగిరి తనయపైకి [illegible] చూపులు కన్య కుమారివైపు పరుగులు తీస్తాయి. అవి రెండూ వింధ్యగిరిపై కలుసు కొని విరులుగా మారి చిరుజల్లులుగా కురుస్తాయి. పార్వతీ పరమేశ్వరుల చూపుల పందిరి దేశమంతటా అల్లుకుంటుంది. ఆ పందిరిలో ఎందరెందరో దేవతలు! వారం దరి అనుగ్రహవీక్షణాలు పందిరిలో తోరణాలల్లుతాయి చుట్టు తెరలుగా మారు లాయి. ఎంత దివ్య దర్శనం!

ఒక్కొక్క స్వామి ఒక్కొక్క ప్రాంతంలో వెలసి మానవజాతికి రక్షణ కల్పిస్తూ వుంటాడు. ఆ ప్రాంతంలో నివసించే వారంతా ఆ దేవుని పెంపుడు బిడ్డలు. వారి పోషణ, రక్షణ శిక్షణ భారం ఆ ప్రభు దంపతులు వహిస్తారు. అలా వెలసిన ప్రభువులలో వేములవాడ భీమేశ్వరస్వామి ఒకరు. ఆయన కటాక్ష వీక్షణాలు ప్రసరించిన తావుల్లో ప్రజలు పుణ్య జీవనులు. రవంత భక్తి భావన గల వారందరూ ఆయన పూజారులు. వాడవాడలోని వారు. వేములవాడకు వెన్నెల దారులు వేసుకొని పరుగులు తీస్తూ వుంటారు. ఐహికమనే చీకటిలో చిక్కుకు

పోయిన జీవులకు వేములవాడ ఒక వెన్నెల ఓడ. ఆ ఓడలో చేరినవారందరూ సంసార సాగరాన్ని దాటటం ఎంతో సులభం.

హనుమాజీపేట వేములవాడ పరిసరంలో గల చక్కని పల్లె. అందువల్ల నారాయణ రెడ్డిగారు పసితనంలో అక్కడికి పరుగులు తీసేవారట. అక్కడ భక్తులు చేసే గానాలు వినేవారట. నృత్యాలు తిలకించేవారట. హరికథలు విని ఆనందించే వారట. జీవులు దేవుని కీర్తించటం ఆ కీర్తిని ప్రదర్శించడం ఒక అనుపైన మనమైన కార్యక్రమం. అలాటి సత్పురుషుల హృదయాలలో వెలుగు జిలుగులు పలల్లు కుంటాయి. ఆ వలలలోనే ముక్తిని పట్టేది. శక్తిని సంపాదించు కొనేది. రాజేశ్వరస్వామి రెడ్డిని ఆశీర్వదించి వుంటాడు. ఆ పసి హృదయంలో వెలుగు తొంగి చూసివుంటుంది. గానం చోటు చేసుకొని వుంటుంది. కవిత చిందులు వేసి వుంటుంది. అందువల్లనె యింతటి గొప్పకవి కాగలిగారు. ఆ స్వామి ఒక బాలుని గొప్ప పండితునిగా చేయగలిగాడు. ఆయన దయ అనే పట్టు గొడుగు నీడనే నారాయణరెడ్డిగారు అప్పటి నుంచి పయనిస్తున్నాడు. ఆ నీడ తెల్లని నీడ.

నాటి నేటికి యెన్ని
నాణ్యతలు మెరిగె
ఆ నాటి నెలవంక
నెలరాజుగా పెరిగె

## 'చిగురు మేపరి'

---

కరీంనగర్‌లోనే కవితకు నాంది వాక్యం పలికిన రెడ్డిగారు భాగ్యనగరంలో కలం విదిలించారు. కమనీయ కవితకు పాదులు త్రవ్వారు. లతలు పెరిగి పొదరిండ్లైనాయి. పరిమళాన్ని వెదజల్లినాయి. కవిని జూడగానే, దర్శించగానే ఆయన సృష్టించిన పొదరిళ్ల సుమధూళి ప్రసరించినట్లవుతుంది. ఆ సువాసన గుండెలను తాకుతుంది. చెండులుగా మారుస్తుంది. అప్పుడు కవి నిమిత్త మాత్రుడవుతాడు. పరివ్యాప్తమైన సుమగంధం నుంచి కవిత తొంగిచూస్తుంది. రంగురంగుల పూవులుగా వికసిస్తుంది. బంగారు వేణువు పూదినట్లుగా కమ్మని స్వరాలు వినిపిస్తుంది. అందువల్లనే కవి దర్శనం అంత మనోజ్ఞం. అంత మనోహరం.

నారాయణరెడ్డిగారు పట్టభద్రులయ్యారు. దానితో కొంత ధిషణ ఏర్పడింది. కావ్యగవేషణ ఏర్పడింది. మనస్సు దువ్వుకొన్నారు. భావాలు త్రవ్వుకొన్నారు. గొంతులో పసిడిమువ్వ మ్రోగింది. "నవ్వని పూవు" పూచింది. అది వారి తొలి రచన. ఆ నవ్వని పూవును నవ్వేపూవుగా, నవ్వించే పూవుగా, అనేక రకాలుగా చిత్రించడానికి వారి బంగారు పాళీ ప్రయత్నించింది. ఆ ప్రయత్నంలో నుంచే యితర గ్రంథాలు క్రమంగా వెలువడ్డాయి. ఒకప్రక్క కవితా వ్యాసంగంలో మునిగి, మరియొక ప్రక్క ఆధ్యాపకత్వం నిర్వహించవలసి వచ్చింది. అందులోనూ అందె వేసిన చేయి అనిపించుకున్నారు. అక్కడితో ఊరుకొనలేదు. పరిశోధన చేసి డాక్టరేటు పొందాలని అభిలాష, ఆవేశం ఏర్పడ్డాయి. నిజానికి కొందరి పాండిత్యానికి డాక్టరేటులు అక్కరలేదు. బయట వారి కోసం కావాలి

పదవులలో పోటీలకు కావాలి. దాని ప్రయోజనాలు దానికున్నాయి. దానిని సంపాదించుకొనుటలో రెడ్డిగారు తమ ప్రయోజనంతోపాటు మరియొక ప్రయోజనం కూడా సాధించారు. ఆధునికాంధ్ర సారస్వతం మీద వారు పరిశోధన చేసారు. దానిని ఒక ప్రమాణ గ్రంథంగా రూపొందించారు. ఆధునిక యుగంలో తెలుగుభాష ఒక చక్కటి ఒంపు తిరిగింది. ఆ ఒంపులో చూతవృక్ష శాఖలమీద వ్రాలి ఒకటి రెండు కోయిలలు గొంతుసవరించి క్రొత్త రాగాలు వినిపించినాయి. అవి విని మరికొన్ని కోయిలలు ఆ కొమ్మల మీదనే వ్రాలి అవే స్వరాలు అందుకున్నాయి. కవితా వాహిని వొడ్డున లేతమామిడి గుబురులు యింపుగా సొంపుగా పెరిగినాయి. కోయిలలుగుంపులుగా గుంపులు వ్రాలినాయి. ఆధునిక యుగానికి అందిన మహాభోగమది. దానిని అందుకొని ఒక కోయిల అందాలు త్రవ్వి పొయ్యటం ఒక అద్భుత ఘట్టం. అలా స్వరాన్ని మేళవించే అదృష్టం రెడ్డిగారికి కలిగింది. అన్నిటిలో గల ఫణుతులను, బాణీలను యేరి తమ హృదయ విపంచి మీద రాగ ప్రస్తారం చేయగల గాయకులైనారు రెడ్డిగారు. అది నిజానికి తెలుగు సాహిత్యానికి అందించిన ఒక గొప్ప కానుక.

రెడ్డిగారు పరిశోధన చేస్తున్న సమయంలో రెండు మూడు సార్లు నేనాయనను కలుసుకున్నాను. అప్పుడు నేను ఆంధ్రప్రభ వారపత్రిక చూస్తూ వుండేవాణ్ణి. ఎప్పుడు వెళ్ళినా చప్పున లేచి స్వాగతం చెప్పేవారు. నేను పత్రికకు ఏదైనా గేయం వ్రాయమని అడిగేవాణ్ణి. ఆయన కాగితాల కట్టలు చూపించేవారు. "తెలుసు - కాని యేదో చిన్నది. సంచికలో మీ గేయం వుండాలి" అనేవాణ్ణి. కాదనలేక తలవూపేవారు. అలాగే ఒక చిన్న గేయం వ్రాసి పంపేవారు. ఆయనకు యెన్నిమాటలో వచ్చు. కాని మాట కాదనటం చేతకాదు. ఇప్పటికీ నేను ఆయనను బాధపెడుతూవుంటాను ఏదో వ్రాయమని. ఆయన వ్రాసి పంపుతూనే వుంటారు. మహా రచయిత లక్షణాలలో యిది ఒకటి. చాలమంది అంటూంటారు "నేను చేసే పని ఆపి, వ్రాసే గ్రంథం ముడిచిపెట్టి యితరులకోసం వ్రాయలేను" అని. కాని మధ్య మధ్య పత్రికలలో కనిపించడం, కవనాలు కురిపించడం, పాఠకుల్ని మురిపించడం యివన్నీకూడ ఉత్తమ లక్షణాలు. వరద వచ్చేదాకా నీరు తాక్కండి, వేచి వుండండి అంటుందా మహానది? తన కడుపులో

చాల జలం వుంటుంది. అందువల్ల చలమలు త్రవ్వుకోమని సంజ్ఞలు చేస్తుంది. కొంత సైకతాన్ని తొలగిస్తే జలం అందుతుంది. జనుల దాహం తీరుతుంది. మహానది లక్షణమది. అలాగే కవులు కూడా —

రచనల విషయంలో రెడ్డిగారికి కొన్ని అలవాట్లు వున్నాయి. అన్ని పత్రికలలో కాకపోయినా, అన్ని రోజులలో కాకపోయినా సంచికలు వెలుపరించి నపుడు వారు తమ రచన ఒకటి అందిస్తూ వుంటారు. అది ఒక విధంగా వారికి కవితా దర్శనం. రెడ్డిగారు ఒకసారి చెప్పారు "ఎన్ని పనులున్నా ఏటా ఒక పుస్తకం తప్పకుండా వెలువరిస్తా"నని. ఈ వార్షిక పుష్పం కోసం అంతులేని ఆలోచన సాగిస్తున్నా మధ్య మధ్య అనువైన రచనలు కొన్ని చేసి పాఠకులలో చనువు సంపాదించుకుంటూ వుంటారు. చనువు కీర్తికి కాణాచి.

వ్యోమ పథమున వెలుగు
నొక్క చంద్రుడె రేయి
యశము నిండిన యెడద
చందమామలు వేయి

# పూల కిరీటాలు

సరస్వతి ఆశీర్వదించింది బాలనారాయణరెడ్డిని. ఆ బలంతో పరుగులు తీయడంలో ఆశ్చర్యమేముంది. కొంతదూరం పయనించిన తరువాత అలాటి వారికి పల్లకీలు వచ్చి పక్కన నిలుస్తాయి తేరులు లేకపోయినా కారులు వచ్చి ఆగుతాయి. అంతకు మించిన శుభముహూర్తం ఎదురైతే మత్తేభాలుకూడ వచ్చి నిలుస్తాయి అదృష్ట జీవులకు అందే భోగాలు అవి. ఇక బిరుదులమాటా కొదువ వుండదు. రెడ్డిగారు అందుకున్న బిరుదులు, పొందిన సన్మానాలు అంతులేనివి. ఫిలిం సరస్వతికూడ వారిని పలచి వళలో వేసుకొనుటవల్ల సన్మానాలు, బహుమానాలు కోకొల్లలైనాయి. ఆయన వెళ్ళిన చోటల్లా సన్మానం. ఆయన రావటం సభికులకు సన్మానం. సాహిత్యపరంగా చాల చిన్నతనంలోనే సన్మానాలు ప్రారంభమైనాయి, కృతి సమర్పణలు కూడ జరిగినాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు వారి గ్రంథం ఋతుచక్రానికి బహుమతినందించి సత్కరించారు. తరువాత కేంద్ర సాహిత్య అకాడమీవారు వారి "మంటలూ-మానవుడూ" గ్రంథానికి బహుమతినందించి గౌరవించారు. సాహిత్యవీథులలో యీ బహుమతులు బంగారు పల్లకిలో ఊరేగింపులు. అటుపిమ్మట వారికి కేంద్ర ప్రభుత్వం "పద్మశ్రీ" బిరుదునందించి సత్కరించింది. ఈ బిరుదు పరంపరలతో మీరట్‌లో విశ్వవిద్యాలయం అందించిన డాక్టరేటు ప్రశంసార్హమైనది. ఒక తెలుగు కవి తన వెలుగు నంతదూరం ప్రసరింపజేసుకోవడం గర్వింపదగిన విషయం. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు వీరికి "కళాప్రపూర్ణ" బిరుదునందించి వేనోళ్ల కొనియాడారు. ఇక్కడ ఒక స్వంత విషయం చెప్పుకోవాలి. దగ్గర బంధువులముగా

భాసిస్తున్న మేమిరువురము ఒకే వేదికమీద "కళాప్రపూర్ణ" బిరుదునందుకోవడం ఒక వింత సంఘటన. బిరుదులు ప్రకటించబడగానే ఫోనులో పరస్పరం అభినందించుకొంటున్న సందర్భంలో "అవును మనమిద్దరం యిప్పుడు తోడుపెళ్ళి కొడుకులం" అన్నారు ఆయన. నేను నవ్వుకొని "యిది ఆపామాషీ సంఘటన" అన్నాను. ఎన్ని బిరుదులు వచ్చినా తన పేరే తన బిరుదుగా భాసించే కవి నారాయణరెడ్డిగారు. సి. నా. రె. దైవమిచ్చిన బిరుదు. ఇంకా ఎన్ని బిరుదులో రావలసి వున్నాయి. సన్మానాలు వేయిదాటి వుంటాయి. సాయంత్రాలన్నీ సభావేదికలపైనే గడుపుతూ వుంటారు. అందులో కొన్ని సన్మానాలు. శాలువాలు బీరువాలు నిండివుంటాయి. సన్మాన పత్రాలకు గోడలు చాలవు. మొమెంటోలు నిత్య ప్రదర్శనలు —— ——

దైవ బలంతో సంపాదించుకున్న సంపద యిదంతా.

ఏ తరువున కే లతలు
ఎవరిచ్చు కానుకో
ఏ ఎదకు యే చెలిమి
ఎంతెంత వేడుకో

# గేయ భగీరథుడు

రెడ్డిగారు డాక్టరేటు పొందిన సమయంలో నాకు హైదరాబాదు బదిలీ అయింది. చిక్కడపల్లిలోనే కాపురం. ఒకరిమొకరం కలుసుకుంటూ వుండే వాళ్లం ఆ సమయంలో హైదరాబాదులో 'భాషాకుటీరం' స్థాపించాం. మహానటులు స్థానంవారు ప్రారంభోత్సవం చేశారు. మహానాయకులు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అధ్యక్షత వహించారు. మహామాత శ్రీమతి యల్లాప్రగడ సీతా కుమారిగారు ఆశీర్వదించారు. ఈ చిన్నసంస్థ పక్షాన మొదటిసారిగా కొత్తగా డాక్టరేటు పొందిన నారాయణరెడ్డిగారిని సన్మానించాలని సంకల్పించాం. సభ నాట్యాచార్యులు నటరాజ రామకృష్ణగారి నర్తనశాలలో జరిగింది ఆంధ్ర పితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు అధ్యక్షత వహించారు. ఆ సభ కొద్దిగా ముద్దుగా జరిగింది. రెడ్డిగారు మాట్లాడుతూ మా భాషాకుటీరం పట్ల మక్కువ ప్రకటించారు. మక్కువలు ఒక్కొక్కప్పుడు నిక్కువం కావు. సభా మర్యాద పాటించుటకే ప్రదర్శిస్తూ వుంటారు. రెండు దశాబ్దాలు గడిచినా రెడ్డిగారి మక్కువ మొక్కవోలేదు. పైగా చక్కగా పెరుగుతూ వచ్చింది. తరువాత కొంత కాలానికి భాషకుటీరం నాతోబాటు బెజవాడ చేరింది. రెడ్డిగారు అక్కడ కూడ సభకు వచ్చారు. వారితో ఆ రోజు మహానటులు గుమ్మడి వెంకటేశ్వరరావు గారు, శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు కూడ విచ్చేశారు. ఆ రోజు రెడ్డిగారిని 'శబ్దం ఒక కిటికీ' అనే విషయంపైన ప్రసంగించమని కోరాం. ఆయన నవ్వుతూ నేను 'అక్షర గవాక్షము' అని రాసాను ఒక పుస్తకం. దానికి దగ్గరగా యిచ్చారు మీరు అంటూ గొప్పగా ఉపన్యసించారు. ఆ రోజు వారిని మల్లెలు,

కనకాంబరాలు, లేగులాబులతో సత్కరించాము. సత్కరిస్తూ యీ క్రింది పద్యాలు చదివాము.

"వెలుగు పాటల పాతర వెండి తెరకు
బుట్టలను త్రవ్వి యిచ్చెడి బుద్ధిశాలి
రమ్య కవితా విపంచి నారాయణాఖ్య
మల్లెపూవుల చల్లని జల్లులివిగో"
"నవ్యతకు తీరుతెన్నులు భవ్యగతులు
తీర్చిదిద్దినయట్టి మాతెల్గు బిడ్డ
రమ్య కవితా విపంచి నారాయణాఖ్య
కనకవర్ణంబులీ కనకాంబరములు"
"తెలుగుబాసల కొసలను తేనె చిందు
పదములెదలోన దాచిన పండితుండు
రమ్య కవితా విపంచి నారాయణాఖ్య
లెగులాబుల జడివాన లివిగో మీకు"

నిజానికి ఎన్నో విలువైన కానుకలు సమర్పించవలసిన కవికి పూలతో సరిపెట్టడం తేలికపనైన సభలో అదెంతో బరువుగానే తోచింది. సుబ్బిరెడ్డిగారు ఆనందాశ్రువులు కురిపిస్తూ యింత చిన్నగా కనిపించిన గొప్ప సన్మానం వుండదన్నారు. కొంత కాలానికి భాషాకుటీరం మళ్ళీ హైద్రాబాదు వచ్చింది. అదేమి విచిత్రమో మళ్ళీ యిక్కడ తొలి సన్మానం నారాయణరెడ్డిగారికే జరిగింది. అది సన్మానం మాత్రమే కాదు 'గేయ భగీరథుడు' అనే పేరుతో ఒక అభినందన గ్రంథం కూడ వేశాము. అప్పటికి వారి వయస్సు 44 సంగులు. వారు పుట్టింది ప్రజోత్పత్తి సంవత్సరంలో. అప్పటి నుంచి ఒక్కొక్క సంవత్సరానికి ఒక్కొక్క అభినందనం ప్రచురిస్తూ గ్రంథం వెలువరించాము. ఇది మేము భాషా కుటీరం తరపున హైద్రాబాదులో వెలువరించిన గ్రంథాలలో మొదటిది కావటం, ప్రశంసించబడటం ముదావహం. రెడ్డిగారు అనేక సార్లు భాషాకుటీరానికి వచ్చారు. నా షష్టిపూర్తి సందర్భంలో ప్రత్యేక సంచిక ఆవిష్కరించారు. వారికి

శ్రీమతి జ్ఞానప్రసూన, శ్రీమతి విజయలక్ష్మి అనువదించిన పున్నమిలేని వెన్నెల అనే గ్రంథాన్ని అంకితం చెయ్యడం జరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన ఆరుగురు ఆచార్యవర్యులను సన్మానించే మహాసదవకాశం మాకు లభించింది. అది గొప్ప సభ. ఆనాడు రెడ్డిగారు అన్నారు ఒక చిన్న సంస్థ ఒక పెద్ద కార్యాన్ని సాధించింది అని. ఆ సందర్భంలో ఆచార్యవర్యులందరి గురించి వ్రాసిన వ్యాసాలను "పన్నీటి జల్లు" అనే పేరుతో ప్రచురించాము. ఆ గ్రంథంలో ఆయా ఆచార్యవర్యులు వ్రాసిన గ్రంథాలు, వారి బిరుదులు, వారి ఆధ్వర్యంలో డాక్టరేటు చేసిన వారి పేర్లు ఉటంకించాము. ఆనాడు మేము ప్రచురించిన వ్యాసాన్ని ఈ గ్రంథంలో మరో తావులో ముద్రిస్తాము.

జిలిబిలి పలుకుల 
చినవాడే నేడు
గురువుగా మారేను
కులపతిగ నిలిచేను

# ఒకరన్నారు

---

ఆంధ్ర దేశంలో ఆనాడు నుండి ఈనాటి వరకు — అంటే నన్నయ్య నుండి నారాయణరెడ్డి వరకు ఎందరో మహా కవులు ఉద్భవించారు. అందులో కొందరు మాత్రమే తపశ్శక్తి, సర్వసమానత్వమూ, విశ్వహితైకచింత కలవారు కనిపింపుతారు. కొందరు కవులకు బహుజన్మ దుర్లభమైన కవితా సంపద లభించినా గాని హృదయవైశాల్యం లేక కులమత దూషణ, పండిత దూషణ, భగవంతుని దూషణ చేస్తూ, ఇట్లా రాగద్వేషాలతో తమ కవిత్వాన్నే దూషితం చేసుకుంటూ వుంటారు.

డా॥ నారాయణరెడ్డిగారిది విశాలహృదయము. "చిన్నారి పొన్నారి చిరుత కూకటి" నుండి సరస్వతీ ప్రసన్నమైన యీ మహాకవి రచనలు వ్యక్తి దూషణ, మతావేశం, దురభిమానం గోచరింపక ఉదాత్తమైన భావాలతో శోభిల్లుతూ వుంటాయి.

క్రియాశీలియైన నారాయణరెడ్డిగారిలో ప్రశంశింపదగిన గుణం ఒకటున్నది.

ఆయన ఏపని చేసినా కావ్యం వ్రాసినా, కవితల్లినా, పాటరచించినా, మాటలు చెప్పినా చక్కని ప్రయత్నం చేసి "యత్నాత్కరోమి యది చారు తరం కరోమి" అన్నట్లు ఆ విషయాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి ఒకవేళ తమకు తెలియని టెక్నికల్ విషయాలుంటే ఆయాశాస్త్రజ్ఞుల నుండి తెలుసుకొని దానికి సంబంధించిన పరిసరాలను పరిశీలించి వచ్చిన తరువాతనే ఆ విషయాన్ని సుపరిష్కృతంగా వెలువరించడం సామాన్య పండితులలో లేని విషయం.

సహృదయుడైన నారాయణరెడ్డిగారి రచనలలో భారత స్త్రీ లోకముపై తెరలేని గౌరవము కనిపిస్తుంది. చాలా మంది రచయితలు కవితా సంస్కారం వుండికూడా ఆత్మ సంస్కారాన్ని పొందలేక తమ కావ్యాలలో దుష్ట స్త్రీ పాత్రలను సృష్టించి తమ కుసంస్కారాన్ని వెల్లడి చేసుకుంటారు. గాంధీ మహాత్ముడు, రవీంద్రుడు, కందుకూరి వీరేశలింగమువంటి మహనీయులు స్త్రీ జాతిలోని త్యాగాన్ని, ప్రేమనూ, కార్యదీక్షతనూ ప్రశంసిస్తారు. నారాయణరెడ్డిగారు నాట్యకర్త్రియైన లకుమలో చూపిన భక్తి, రక్తి, త్యాగమూ, ఆరాధన మహాకవులు మాత్రమే నిర్మింపగల సృష్టి.

మధుర భాషియైన నారాయణరెడ్డిగారి మాటలు కూడ కవిత్వంలాగే శ్రుతి మధురంగా వుంటాయి.

చాలాకాలం నాటి మాట. 1950 ప్రాంతాల్లో నిజాం కాలేజీలో విద్యార్థుల ఆంధ్రోత్సవాలు జరుగుతూ వుండేవి. తెరవెనుక నుండి ఒక విద్యార్థి లేత పలుకులతో మధురాతిమధురంగా వ్యాఖ్యానం వినిపించేవాడు. అంతటితో తెర ముందు ప్రదర్శనాలకంటె తెరవెనుక వ్యాఖ్యానానికే ఎదురు చూస్తూ ముగ్ధులై పోతుండేవాళ్లు ప్రేక్షకులు.

ఆనాటి ఆ విద్యార్థి వ్యాఖ్యాత "ఇంతింతై వటుడింతయై ... బ్రహ్మాండాంతసంవర్ధియై" అన్నట్లు ఈనాడు అనేక సారస్వత మహాసభలకు, కవి సమ్మేళనాలకు, సినిమానటుల సంగీతోత్సవాలకు, శతదినోత్సవాలకు తన కంఠంతో వ్యాఖ్యానాలను అందించి ఆ సభలకు ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని కలిగించుతూ వుండటం మనకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించుతూ వుంటుంది.

మహామేధా సంపన్నుడైన డా॥ నారాయణరెడ్డి ప్రాచీన ఋష్యాంశసంభూతుడంటే అతిశయోక్తి కాదనుకుంటా. "నానృషి కురుతే కావ్యం" అన్నట్లు ఆంధ్ర వాఙ్మయ చరిత్ర వంటి విమర్శక గ్రంథాన్ని వాఙ్మయ ప్రపంచానికి శాశ్వతమైన అలంకారంగా రూపొందింప గలిగినారు.

తన శిష్యులను తనంత లెక్చరరులను చేయగలిగిన మహోపాధ్యాయుడై నారాయణరెడ్డి విద్యార్థి లోకానికి చందమామవలె నిరంతర ప్రేమపాత్రుడు. సాధారణంగా తెలుగు బోధనా తరగతిలో విద్యార్థులు తమ స్వంత వ్యవహారాలను చక్కబెట్టుకొనడం మామూలు నారాయణరెడ్డిగారి బోధనా వర్షానికి విద్యార్థులు చాతక పక్షులలాగా ఎదురుచూస్తారని విన్నప్పుడు ప్రజల ఆశ్చర్యానికి అవధి వుండదు.

సర్వంకష ప్రజ్ఞాశాలియైన సి. నారాయణరెడ్డిగారి పద్యపఠనంగూడ పండిత లోకంలో ఒక ప్రత్యేకమైన విశిష్టతను కలిగించుకున్నది. ఎదలోపలి ఎదలోనుండి ఆవేశంతోను, ఊపుతోను, అంత్య ప్రాసల నొక్కులతోనూ పఠింపబడే ఆ సాంప్రదాయము ఎందరో కవులకు, స్నేహితులకు, శిష్యులకు ఆదర్శప్రాయమూ అనుకరణ ప్రాయమూ అయిందంటే నారాయణరెడ్డిగారిని ముందు తరాల ప్రజలు ఒక కులపతిగా సన్మానించుకునే పరిస్థితులు సమీపించినట్లు మనము భావింపవచ్చును.

అసలు నారాయణరెడ్డిగారి కవిత్వములో తొణికిసలాడే జాతీయభావాలు, ఆత్మాభిమానమూ, భగవంతుని యందలి విశ్వాసమూ మాత్రమేగాక సమస్త మానవజాతి యందునూ ఆయనకుగల సముజ్వల ప్రేమకూడ ఇంతగా ప్రజాదరణ పొందడానికి తోడుపడినదని భావింప వచ్చును

అఖిలాంధ్ర జాతిసమైక్యతకు ఆవేదనచెంది,
"వీరతెలంగాణా నాది వేరు తెలంగాణా కాదు"

అని శంఖారావం చేసిన యీ కవిమాణిక్యము అఖిలాంధ్ర జాతికి అలంకార ప్రాయుడు.

నారాయణరెడ్డిగారు సహస్రవసంతాలు ఆయురారోగ్యాలతో శోభించి విశ్వశ్రేయం కోసం మరిన్ని మహత్తర కావ్యరత్నాలను రచించి తెలుగుతల్లిని రత్నగర్భగా సార్థకం చేస్తారని ఆశించుతున్నాను.

(ప్రఖ్యాత దేశసేవకురాలూ, విదుషీమణి, 'మనస్సు గల మహిళ' శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారిగారు భాషాకుటీరంలో నారాయణరెడ్డిగారికి సన్మానం సందర్భంగా అందించిన సందేశం.)

రాతి లోపల ఎన్నో
రాగాలు గలవు
రాగాలలో దివ్య
భోగాలు గలవు



# శిలల కలలు

రెడ్డిగారి పాటలకు తొలుతగా ప్రచారం రేడియో ద్వారా కలిగింది. "రామప్ప దేవాలయం" నాటికలో వ్రాసిన పాటలు ప్రతి చెవికేగాదు ప్రతి నోటికీ అందినవి ఆయన ఆ పాటలను వ్రాయటంలో ప్రకృతి చిర్మనాన్ని అపేక్షించారు. అది సార్థకమైంది. లేకపోతే రాతిలో కన్నులు, బండలలో గుండెలు, శిలలో జీవశక్తి – యివన్నీ ఎలా వచ్చి వుంటాయి ? ఈ పాట చదువుతుంటే రెడ్డిగారి మనసు కొన్ని యుగాలు వెనుకకు నడిచి నదుటకన్న ముందు నల్లరాళ్లు పలికి వుంటాయని, పాటలు పాడి వుంటాయని, జీవించి వుంటాయని ఆయన వూహించి వుంటారు. తరువాత తరువాత స్థాణువులై వుంటాయి. కాని హృదయాలు మాత్రం దాగి అలాగే వుండివుంటాయి. బయటకు కనిపించని కన్నులు లోలోపల ఎన్నో వుంటాయి. అవి మూర్తిమంతమైన రూపం దాల్చటానికి తపస్సుచేస్తూ వుండి వుంటాయి ఆ తపస్సు ఫలించి అవి దేవతా విగ్రహాలుగా మారి వుంటాయి. ఈ మార్పు తేవటానికి శిల్పులు అవతరించారు. కళానైపుణ్యం, ఆధ్యాత్మిక భావన సౌందర్యసంపద వారిలో దాగి దోబూచులాడుతూ వుంటాయి. వారి చేతిలో ఉలి పాషాణానికి ప్రాణాలు పోస్తుంది. అంతేకాదు – ఆ ఉలి ప్రభావంవల్ల శిలల కలలు పండుతాయి. అందువల్ల శిల్పులుకూడ కారణజన్ములుగా భావించబడుతూ వుంటారు. అవును మరి తమ చేతిలో శిల చిద్విలాసమూర్తిగా మారటం, ఆలయంలో జేరటం అర్చనలు అందుకోవటం, వేలాది భక్తులు గంటలు మ్రోగించి మ్రొక్కటం–యిదంతా తిలకించిన శిల్పి పులకించక ఏం జేస్తాడు ?

నారాయణరెడ్డిగారు రాతిలో గల వెలుగును, నవనీతాన్ని, అన్నిటినిమించి లోలోపల దాగిన పవిత్రాత్మను గ్రహించి వాటిని వర్ణించారు తమ పాటలో – ఉలి చూసి అవి భయపడలేదు. ఉప్పొంగినాయి. దెబ్బలకు బాధపడలేదు–ఉబ్బిపోయి నాయి. ఎందువల్ల ! అవి దేవతా రూపాలు పొందబోతున్నాయి కనుక. అందువల్లనె రెడ్డిగారన్నారు "ఉలి యలికిడి విన్నంతనే గలగలమని పొంగి పొరలు" అని – అంటే ఆయన శిల్ప రహస్యాన్ని వాటి జీవిత రహస్యాన్ని గ్రహించి తాము అంతకన్న ఎక్కువగా ఉప్పొంగిపోయారన్నమాట. "జీవమున్న నరులకన్న శిలచే నయమనిపించును" అని కూడ అన్నారు. శిలలు కలకాలం నిలుస్తాయి – నరులు నిలవరు. శిలలు చిరకాలం మూగగొంతుతో దేవుని పిలుస్తాయి – నరులు కొంతకాలమే పిలవగలరు. శిలలు పిలిచి పిలిచి దేవతలుగా మారిపోతున్నాయి అసలు స్థితికీ మోక్షానికీ మధ్య అవి మౌనంగా నిలుస్తున్నాయి. నరులు అలా నిలువ లేరు. ఎన్నో చీకటి తెరలు వారిని పట్టుకుంటాయి. అందువల్ల ఒకప్పుడు భగవంతుణ్ణే మరచిపోవచ్చు – అందువల్లనే శిలలే నయమన్నారు రెడ్డిగారు.

ఈ ఒక్క పాటలో ఆయన ప్రకృతిలో నిండిన దైవత్వాన్ని అంటిల మాటున గుండెలలో పండిన ఆధ్యాత్మికత్వాన్ని అవగాహన చేసుకొని అరచేతిలో ఉసిరిగా అందించారందరికీ. కఠిన శిలలో కావ్యాలున్నాయన్నారు కొందరు పెద్దలు రెడ్డిగారు ఆ కావ్య రీతిని గ్రహించి నీతిగా ప్రబోధించారు యీ పాటలో. రాతిలో దాగిన కన్నులను చూడగలిగిన కన్నులున్నవారు ధన్యులు గదా !

పురివిప్పు నెమలిలో
ఎంత అందమ్మో
విబుధ వాక్యాలలోన
ఎంత గంధమ్మో



# షహనాయి

ప్రకృతి గొప్ప చిత్రపటం. అందులో ఎన్నెన్ని అందాలో! అందరు తిలకిస్తారు. కొందరే గ్రహిస్తారు. ఆ కన్ను వేరు. మనస్సే ఆ కన్ను. అలాంటి మనసున్నవాడు గడ్డిపూవుల అందం కూడా ఒక గేయంగా వ్రాయగలడు. ఒక చక్కని తోటమాలి ఒక ప్రబంధంగా చిత్రించగలడు. వారలా చిత్రించినప్పుడు కలిగే ఆనందాన్ని సామాన్యులు అందుకొని ఆహ్లాదపడగలరు. అది అద్భుతమైన రసవాహిని లాంటిది. ప్రతిమాట ఆ వాహినిలో కెరటంగా సాగుతూ సాగుతూ నురుగు గజ్జెల సందడి చేయగలదు. డెందాలను అలరింప గలదు.

ఇలా రహస్యాలను రంగురంగుల చిత్రపటాలుగా అందించగలవారు, గాలిపటాలుగా ఎగరవేయగలవారు కొద్దిమంది మాత్రమే వుంటారు. డా. నారాయణరెడ్డిగారు అలాంటి వ్యాఖ్యాత. కాలెజీలో చదువుకొంటున్న రోజులలోనే సాంస్కృతిక ఉత్సవాలలో ఆయన వ్యాఖ్యాతగా వ్యవహరించేవారు. అందరి చెవులలో తేనెలు గుమ్మరించేవారు. ఒక్కొక్కప్పుడు ప్రేక్షకులు ప్రదర్శన మాట మరచి, వ్యాఖ్యలు విని తన్మయత్వం చెందుతుండేవారు. వారి వ్యాఖ్యానమనగానే ఎంతో మంది ఆసక్తితో పరుగెత్తుకు రావటంపరిపాటి అయింది.

సినిమా రజతోత్సవాలు, సాంస్కృతికోత్సవాలు, నృత్యోత్సవాలు ఎక్కడ జరిగినా రెడ్డిగారిని ఆహ్వానించటం ప్రథమ కర్తవ్యంగా భావించబడుతోంది. వారి మాట అసలు ప్రదర్శనాన్ని వందరెట్లు ఆకర్షణీయంగా చేయగలుగుతుంది. ఆయనలో సహజంగా మంచివాక్కుంది. భావ శబలత వుంది. కళాదృష్టి వుంది.

అన్నిటినిమించి లోకన్ను వుంది. వీటన్నిటివల్లా ఆయన వ్యాఖ్య హృదయ రంజకంగా వుంటుంది. యిది అల్పకార్యం కాదు. ప్రతి అంశంలోని అంత రార్థాన్ని గ్రహించాలి. దానిని విపులీ కరించాలి. విచ్చి విరబూసిన పూల గుబురుగా సంతరించాలి. వీని వెనుక గళం షహనాయిగా మారాలి. అప్పుడు ప్రతి విషయం రసస్ఫోరకమై శ్రవణానందమై, అనుభూతిని అందిస్తుంది. రెడ్డిగారు ఒక దివ్యమైన ఘట్టాన్ని అభివర్ణిస్తున్నప్పుడు అడివి నెమళ్లగుంపు ఆడినట్లుంటుంది. గండు కోయిలల గుంపు పాడినట్లుంటుంది.

ఆయన వ్యాఖ్యానాలు నేను ఎన్నో విన్నాను. కొన్ని కొత్త సొగసులు గుండెల్లో మలచుకొన్నాను. ఆయనతో కలసి ఈ విశాల ప్రకృతిలో సంచరించా లనిపిస్తుంది. మనస్సుపొంగి మధ్యమధ్య ఆయనచేసే వ్యాఖ్యలు వినాలనిపిస్తుంది అప్పుడప్పుడు సాహిత్య వనాలలోనే చిన్న చిన్న షికారులు చేయకలుగుతున్నాం. అప్పుడప్పుడు వారు వినిపించే వ్యాఖ్యల షహనాయి వింటున్నాను.

త్రవ్వండి త్రవ్వండి
లోతుగా గనులు
వెదకండి వెదకండి
రతనాలు మణులు

# 'త్రవ్వండి గనులు'

---

ఒకసారి నేను ఏదో గ్రంథం భాషాకుటీరం పక్షాన ప్రచురించబోతూ — వ్యాసమో ! గేయమోనా అడగటానికి నారాయణరెడ్డిగారి దగ్గరకు వెళ్లాను, విషయం చెప్పాను. ఆయన క్షణం ఆలోచించి "అది సరే రావూరి గారూ ! మీరు భాషాకుటీరం పేరిట చాలా వేస్తున్నారు. అన్నీ మంచివే. కాని మీవి చాలా ఉన్నాయి కదా. వాటిని వదిలి ఈ పనిలో మునిగి వుంటారేం ? మీవి బయటకు రావాలి కదా" అని ప్రశ్నించారు. నేనిలా చెప్పాను. "నా పుస్తకాల సంగతి నేను చూసుకోవటం తేలిక పని కాదు. అవి ఇంకొకరు చూడాలి. లేదా నేను ఇంకొకరిని ఆశ్రయించాలి. నావి నలభై యాభై పుస్తకాలున్నాయి. అవన్నీ అచ్చుపడతాయనే ధైర్యం నాకు లేదు. ఇంతవరకు పది పదిహేను పుస్తకాలు వచ్చాయి. ఇలాగే మెల్లిగా వస్తూ ఉంటాయి" అన్నాను

"ఇలా అనుకోవటం కష్టం" అన్నారాయన. "లేకపోతే చాలా నష్టం భరించవలసివస్తుంది" అన్నాను. నవ్వుకొన్నాం.

ప్రతి రచయితకూ తన రచనలు అచ్చుపడాలనీ, పది మంది చదవాలనీ, కృషి ఫలించాలనీ, ప్రఖ్యాతి గడించాలనీ వుంటుంది. కాని కొందరు కవుల, రచనలను ఏరి హారంగా గ్రుచ్చి పాఠకలోకానికి అందించాలనే భావన చాలా ఉత్తమమైనది. పాఠ్యగ్రంథాలలోనైనా, ప్రత్యేక సంచికలలోనో తప్ప పైన చెప్పిన హారాలు అందవు.

రచయితల గుండెలు గనుల వంటివి. వాటిలో రంగు రంగుల రకరకాల మణులు వుంటాయి. అవసరం వచ్చినప్పుడు వ్రాయాలనే ఉత్సాహం కలిగి

నప్పుడు రచయిత కొన్నిటిని వెలారుస్తూంటాడు. ఆ గనిలో గల మరో మణిని వెతికి తీయడంకోసం వారిని అర్థించడం, వారు అంగీకరించడం జరుగుతూ వుంటుంది. అలాటి మణిహారాలు కొన్నిటిని భాషాకుటీరం పక్షాన వెలువరించడం కోసం నేనెంతో కృషి చేశాను.

ఈ కృషి చాలావరకు ఫలించింది చాలా సంకలనాలు వేయడం జరిగింది. అంటే ఏమన్న మాట ! ప్రసిద్ధి చెందిన గనులలో నుంచి చాల మణులు ఏరు కొన్నాను. గనుల యజమానుల ఔదార్యమే దీనికి కారణం. అలాటి గనులలో నారాయణరెడ్డిగారొకరు. అప్పుడప్పుడూ ఒక మణి త్రవ్వుకొనేందుకు దాన్ని భాషాకుటీరానికి కానుకగా సమర్పించేందుకు వారివద్ద నుండి లైసెన్సు తీసు కొన్నాను.

ఇలా అనుమతి ఇచ్చిన ఇతర రచయితలకూ్కూడా ఈ సందర్భంలో కృతజ్ఞతలను చెప్పుకొంటున్నాను. నా వెనె ఎందరెందరో గనులు త్రవ్వాలి. వీలైనన్ని మణిహారాలు కట్టి తెలుగు వాణికి కానుక అందించాలి.

"త్రవ్వండి గనులు".

చివురాకులో కవిత
చిరుమొగ్గలో కవిత
చిరుగాలిలో కవిత
చిలకరించే దెవరో?



## "జలతారు అంచులు"

---

చీవతనం లేని జీవి, చీదతనాన్ని కోరిపరించే జీవి, పెదరికంలో పెన్నిధి తప్పొప్పొయ్యగల జీవి కవి ఒక్కడే. ఎటుచూచినా ఆనందం చిందులాడే యీ రమణీయ ప్రకృతిని అవగాహన చేసుకోగలిగిన కవికి విచార మెక్కడ వుంటుంది? కవిత మనస్సును వూగించే వుయ్యాల. మనస్సును పలకరించే కోయిల. అలా ఆనందంలో మునిగిన కవికి పొద్దులు లేవు. హద్దులులేవు. విచ్చి విరబూసిన ఒకపూవు వంక చూసికవి నిలిచి పోతాడు. మూగగా ధ్యానిస్తాడు. ఆ మూగ తనమే రాగాలాపనగా మారుతుంది. ఆ రాగాలాపనలో కవిత లాస్యం చేస్తుంది అంతా ఆనందమయం. ఉదయించే సూర్యుడు తూర్పుకొండను అలుముకునే ఎర్రరంగు బాలసూర్యుని పసిడికిరణాలు గుమ్మాల్లో పారపోసి పోయే పచ్చి పసుపు యిలా చెప్పుకుంటూ పోతే ఎన్నెన్నో. ప్రకృతి కవిత్వమయం. గానమయం కవిహృదయమంతే. ఆతని యెద రంగుటద్దాలమేడ. అందులో పచార్లుచేసే కవితాసుందరి హాస విలాసాలు పైకుబికి కవిని కదలిస్తుంటే అతడు మరొకలా ఎలా వుండగలడు? అందువల్లనే కవి యితరులకంటె అన్యమైన అసామాన్యమైన పోకడలు పోతూవుంటాడు.

రెడ్డిగారి వేషభాషలలో కవితగోచరిస్తుంది. పలకరింపులో కవిత గిలకరించిన చప్పుళ్ళు వినిపిస్తాయి. కవి పకపక నవ్వగలడు. ఆ నవ్వులు పందెపు గవ్వల చప్పుళ్ళలాటివి. అలాటి నవ్వులు అప్పుడప్పుడు రెడ్డిగారిలో వినిపిస్తాయి. మిక్కిలిగా చిరునవ్వులే. అవి అందమైన సాంకేతికాలు. ఒకప్పుడు విప్పుకొని

గాలిలో ఎగిరే నికేతనాలు. ఆయన ఎప్పుడు మాట్లాడినా కవిగానే మాట్లాడుతాడు. కవితా గౌరవాన్ని నిలబెడతారు. ఎంత బరువునైన కవితలోనె పైకెత్తుతారు. కవిత తోనే పడగొడుతారు. ఎంత చక్కటి భావాన్నైన అంత చక్కని భాషతో జోడించి, మేళవించి ప్రదర్శిస్తాడు. ప్రతిగేయం. ప్రతి వాక్యం రసస్ఫూర్తిని కల్పిస్తుంది ప్రతి వుపన్యాసం కవితా సుందరికి జలతారు మేలుముసుగు. అందమైన సుందరమైన కవితాసుందరి తన యెదుట ఒయ్యారంగా వొళ్ళు విరుచుకొని కనిపిస్తున్నప్పుడు ఆ అందాన్ని కవితలోకి మార్చుకోటం కష్టం కాదు. ఆమె గుండెమీద చిటిక వేస్తుంది. హృదయం స్పందిస్తుంది. ఆ స్పందనను శబ్దరూపంలోకి తేవటం ఉత్తమ శిల్పం. రెడ్డిగారికా శిల్పం కరతలామలకం. ఆయనవద్ద మెత్తటి పదజాలం ఎంతో వుంటుంది. మెత్తదనమే కాదు మేలిమితనం కూడా వాటికి కల్పించ కలరు. అందువల్ల వారు మాట్లాడు తున్నప్పుడు ఒకప్పుదు మల్లెలమీద చిటికెలు వేసినట్లుంటుంది. ఒకప్పుడు వీణ కొనగోట మీటినట్లుంటుంది. ఒకసారి సన్నాయి వూది వదిలినట్లుంటుంది. అంతేకాదు రెండు పదాలను దగ్గరికి చేర్చటంలో ఎంత వెలుగు, ఎంత సొగసు ఏర్పడుతుందో ఆయనకు తెలుసు. భావాలు ముక్తపదగ్రస్తంగా వెలువడతాయి. భాష అంత్యప్రాసలతో ఒంపులు తిరిగి ఒళ్ళు విరుచుకుంటుంది. ఏ సభలో ఏ పదజాలం వాడాలో ఏభావాలను గుదిగుచ్చాలో ఏ ఎదకు ఏగంధం పూయాలో,ఏ చెవికి,ఏరాగాలాపన అందించాలో ఆయనకు బాగా తెలుసు. ఆయనకు తెలిసినన్ని పదాలు అందరికి తెలియవచ్చు. కాని అనుకున్నప్పుడు అందవు అందంగా అతకవు. అందువల్ల తగినంత భావశబలత గోచరించదు.

ఒకసారి నేను రవీంద్రభారతికి వెళ్ళాను. ఆకాశం మబ్బుపట్టివుంది. అక్కడ రెడ్డిగారు కనిపించారు. ఇద్దరం మెట్లు యెక్కుతున్నాము. "మబ్బులు పట్టినాయి" అన్నారు. నేను "మామూలు మబ్బులు కావు. చూడి మబ్బులు" అన్నాను. ఆయన "ఎంతమంచిమాట" అని క్షణం నిలబడి పోయారు. మన తెలుగు భాషలోగల జాతీయత సొగసు అర్థమైనపుడు ఆయన ఎలా పరవశిస్తారో తెలుస్తుందటువంటి సమయాల్లో. ఆయన నిండుగా కవి. బ్రతుకంతా పండగచేసుకున్న కవి. ఆయన ఏ పాత్ర వహించినా ఎక్కడ సంచరించినా కవిననేమాట

మరిచిపోరు కవికి వుండవలసిన స్థానాన్ని దాటి ఒక్క అడుగు వెయ్యరు. నిత్య కవితా దర్శనం గల కవి. తానూ అందులో భాగంగా మారిపోతాడు తన విలువను తాను చూసుకుంటాడు ప్రతిక్షణం తూచుకుంటాడు ఫోనులో పలకరించినా అదే స్వరం. ఎదురుపడి పలకరించినా అదే గంభీరత అంత కవిత వ్రాసినా రవ్వంత కూడా తరగని కవి. ఆ కవితా హృదయం తేగల పాతర. ఆయన బ్రతుకులో కవిత ఎన్నెన్నో నగిషీలు దిద్దింది. బ్రతుకును జలతారు అంచులు సంతరించింది.

అందాల నడకల
హస్తి సముచయమదిగో
అందాల కవితల
అష్టదిగ్గజములివిగో



# 'అష్టదిగ్గజాలు'

---

ఒకసారి నారాయణరెడ్డిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని తెలుగు శాఖను గురించిన ప్రస్తావన వస్తే "అక్కడ అష్టదిగ్గజాలమున్నాం. అబ్బో! చెప్ప క్కర్లేదు" అన్నారు. నిజానికి ఆ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ ప్రారంభించి నప్పట్నించి దిగ్గజాలే అక్కడ అడుగుపెడుతున్నాయి రాయప్రోలు సుబ్బా రావుగారు తెలుగు శాఖ ప్రారంభించి రమ్యకవితా విలసనానికి తోడుగా ఎందరో పండితోత్తములను అక్కడి కాహ్వానించారు.

నేటివరకు ఆ పరంపర అలా వస్తూనే వుంది. రాయప్రోలువారి తర్వాత ఖండవల్లివారు ఆచార్యపీఠం అలంకరించి పరిశోధన శాఖ ప్రారంభించి అనేకమంది డాక్టరేటులను తయారుచేశారు. ఇప్పటి వరకు ఆ కోవలో అనేకమంది వచ్చి నిలిచారు. వీరిలో అందరూ ఉద్దండులే. అందరూ మహా పండితులే. అందరూ తమకంటె ఘనులైన శిష్యులను తయారు చేసినవారే. అలా వచ్చిన వారిలో నారాయణరెడ్డిగారున్నారు. వారిప్పుడు ఆచార్యపీఠం అలంకరించారు.

ఈ దిగ్గజాలను గురించి ఆలోచించినపుడు — అవధానిగారు, రామరాజుగారు, గోపాలక్రిష్ణమూర్తిగారు చెలమలచెర్లవారు, పాటిబండవారు, బొడ్డపాటివారు, జి. వి. సుబ్రహ్మణ్యంగారు, పల్లావారు, ఇరివెంటివారు, యశోదారెడ్డిగారు, కులశేఖర రావుగారు, నాయని, సీతాకల్యాణి, వేటూరి, ముదిగొండ, డా. గోపి వీరంతా మనకు వరుసగా నడుస్తున్న మత్తేభాలలాగా దర్శనమిస్తారు. అవును, ఉస్మా నియా ఒక పెద్ద కొలువుకూటం. ఎప్పటికప్పుడు వీరిలో కొందరు అష్టదిగ్గజాలుగా కొలువుకూటాన్ని అలంకరించి సొగసు కూరుస్తూనే వున్నారు. వీరి ప్రత్యేకతలను,

కవితలను వివరించటం ఒక విజ్ఞానదాయకమైన కృషి అవుతుంది. ఈ గ్రంథంలో ఒక్క నారాయణరెడ్డిగారిని గురించి మాత్రమే వివరిస్తున్నాను తక్కినవారిని గురించి నేనో మరి ఒకరో వ్రాయగలిగితే ఎంతో విలువగల గ్రంథాలుగా తయారవుతాయి. నారాయణరెడ్డిగారిని మిక్కిలిగా అభినందిస్తున్నాను వారిచ్చిన ఉదాహరణ అలంకార ప్రాయమైంది. ఈ పండిత ప్రకాండులు ఎందరెందరో శిష్యులను తయారుచేశారు. అదంతా హస్తిసముచయం కిందనే భావించబడుతోంది. నలువరాణి కొలువుకూటంలో నడయాడే మత్తేభాలను దర్శించినట్లే అవుతుంది

ఎవరు వేశారీ
బంగారు పీరమ్ము
ఎవరెవరు వచ్చారు
ఇందాసీనులై మురియంగ



# 'ఆచార్యపీఠం'

---

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అంతవరకూ లేని తెలుగుశాఖను ప్రారంభించిన కీర్తి రాయప్రోలు సుబ్బారావుగారికి దక్కింది. అంతవరకు ఉర్దూ భాషదే ప్రాబల్యం. ఎవరూ తెలుగు చదివే వారు కాదు. భాషమీది భక్తి లేక కాదు, జీవితానికి భుక్తి లభించదని. అలాంటి పరిస్థితులలో ఏర్పడిన శాఖలో తొలి తెలుగు విద్యార్థి శ్రీ పల్లా దుర్గయ్యగారు. ఆయన కాలేజీకి వచ్చి జీతం కట్టబోతుండగా ఎవరో బెదిరించారట తెలుగు చదివితే కూడు దొరకదని. ఆయన విడిచి పారిపోవటానికి ప్రయత్నించారుట. అప్పుడు సుబ్బారావుగారు నచ్చచెప్పి చేర్పించారుట. తరువాత మరొక విద్యార్థి వచ్చి చేరాడట. అలా ప్రారంభమైంది ఆచార్యపీఠం.

సుబ్బారావుగారు ఆధునికాంధ్ర సాహిత్యంలో ఆది పురుషుడుగా కొందరిచే పేర్కొనబడిన మహనీయులు. నవ్య సాహిత్యాన్ని ఒక మలుపు తిప్పిన మహా శిల్పి ఆ కోకిల అధ్యక్షపీఠం నుంచి అమరగానాలు వినిపించింది. తెలుగునాడు పులకించింది. వాణి తన వీణపై మురిసిమురిసి రాయప్రోలు పాటలు పలికించింది. వారి తర్వాత ఖండవల్లివారు ఆ పీఠమలంకరించారు. మహా పండితులు. తెలుగు భాషను వడబోసిన నేర్పరి. క్రొత్త సొగసులు ఎన్నిటినో వెలికితీసిన దూర్పరి. వీరి కాలంలో పరిశోధన శాఖ ఏర్పడింది. డాక్టరేటుల బిరుద ప్రదానాలు ప్రారంభమైనాయి. తొలుతగా ఆ బిరుదు పొందినవారు బిరుదురాజు రామరాజుగారు ఖండవల్లివారి ఆచార్యకత్వంలో తెలుగు భాషలో వన్నెలు చిన్నెల కొనలుసాగి వెన్నెల పందిరులల్లుకున్నాయి. భారత పరిశోధన కార్యక్రమాన్ని చేపట్టారు. తెలుగు వ్యాసుడనిపించుకున్నారు. ఆచార్యపీఠం దేదీప్యమానంగా వెలిగింది.

తరువాత సుప్రసిద్ధ పండితులు, శతావధానులు "అపర పెద్దన" బిరుదాంకితులు ఆయిన శ్రీ అవధానిగారు పీఠమలంకరించారు. అపరంజికాంతులు అలుము కున్నాయా సింహాసనానికి. అనర్గళమైన పాండిత్యం, అద్భుతమైన భాషాసాంప్ర దాయాలు, అనిర్వచనీయమైన ఆశుధార. వారి తరగతులు రసతీర్థాలుగా మారి నాయి. వారి తరువాత రామరాజుగారు ఆ పదవినలంకరించారు. పింగళి సూరన అనిపించుకొన్నారు వీరు వీరు జానపద సాహిత్యాన్ని కూలంకషంగా పరిశోధించి దానిలోని సొగసులను వెలార్చి, పాత్రపోషణలను వెలువరించి శిల్పచాతుర్యాన్ని చవిచూపారు. తెలుగు భాషలో ముఖ్యంగా పౌరాణికాలలో వారి దృక్పథం స్వర్ణసోపానం వంటిది. నిరాడంబరమైన వ్యక్తి, నిశ్చలమైన భావనాశక్తి. వారిలో పండితుడు, కవి కలిసిగానం చేసారు. రమ్యావలోకనం వారి సొత్తు వాణి ఎప్పుడూ వారి పొత్తు.

వీరు ఆచార్యపీఠం అలంకరించి వుండగానే నారాయణరెడ్డిగారు కూడ ఆ పదవి నందుకున్నారు. రెండు సింహాసనాలు ఒక దాని ప్రక్కన ఒకటి మెరిసి మురిపించినాయి విద్యార్థిలోకాన్ని. నారాయణరెడ్డిగారని చాలమంది అపర శ్రీనాథుడంటారు. మహాకవి, మహావక్త, మహాగేయ రచయిత అన్నిటిని మించి హుందాతనం గల పండితుడు. వారిని గురించి యీ గ్రంథంలో చాల వివరాలున్నాయి. తరువాత మరియొక సింహాసనం వేయబడింది. దానిపైన పల్లా దుర్గాయ్యగారు ఆసీనులయ్యారు. వీరు పండితులు, గొప్ప దేశికులు. తరువాత శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు ఆచార్య పదవి నలంకరించారు. పరిశోధనా దృష్టి, ప్రగతిభావనాగల సాహితీవేత్తలు, ఉత్తమ భావనలు పంచిపెట్టి విద్యార్థిలోకానికి వెన్నెల జడివాన కురిపిస్తున్నారు.

ఇది ఆచార్యపీఠానికి గల ఉత్తమ స్థితి. ఇక్కడ గల తెలుగు భాషలోని సొగసులను చూడటానికి, కవితలను వినటానికి అప్పుడప్పుడూ వాణి వచ్చి తొంగి చూసిపోతూ వుంటుంది. ఆమె తన వీణను యిక్కడ విడిచిపెట్టివెళ్ళిందేమోనని అనిపిస్తూ వుంటుంది.

వెలుగు చీకటి తెరల
వలయమ్ము జగతి
కన్నీటి పన్నీటి
తలపోత ప్రగతి

# ప్రసన్న గంభీరత

---

కవిత్వము వ్రాసినా కథలు చెప్పినా గేయాలుపాడినా ఉపన్యాసాలు చేసినా బోధన కాని, సాధన కాని-కొన్ని కళలకు కొందరితోనె రాణింపువస్తుంది. కొందరు శిల్పజ్ఞులకు కొన్నిటిలోనె గుర్తింపు వస్తుంది. కాని అన్నిట తానుండి అందరిలోను గూడుకట్టుకున్నవాడు నూటికి కోటికి ఎక్కడో ఒక్కడు.

పదుగురిలో ప్రకాశించే వ్యక్తిత్వం పదుగురిచేత అవుననిపించుకున్న మూర్తిమత్వం. ఊహల చిగుళ్ళను అలవోకగా అందించి పువ్వొత్తుకు లేపగల వుత్సాహ వృత్తం అన్నిటికంటె మిన్నగా-సాటి వాణ్ణి తోటి వాణ్ణి ఆప్యాయంగా ఆదుకొనే మమైకత్వం, రూపుకట్టిన నిండుతనం సి. నారాయణరెడ్డిగారు.

పుట్టింది ప్రజోత్పత్తి. ఆయనలోని ప్రజాశ్రేయానురక్తికది వుపపత్తి. ఊరు హనుమాజీపేట. కాని వూరేగింది అఖిలాంధ్ర జన హృదయాల పూలపల్లకిలో. సిరులు పండించడానికి సిరిసిల్ల తాలూకా లేకనా? కవితా సిరులు పొంగించడానికి యిరికిరుకు తాలూకాలు చాలకనో, ఎందుకో ఆయన చూపు విశాల రంగంమీదికి ప్రసరించింది. అలనాడు ఎప్పుడో వేములవాడలో భీమన్న గుడి ముంగిట కాగడా మల్లె లేరుకుంటున్నప్పుడో – రాజరాజేశ్వరుని కోనేటి గట్టుమీద కూర్చుని విశాల దిఙ్మండలంలో వెలిగే రంగుల సింగిణిని ఎదలో పొదుగుకుంటున్నప్పుడో ఒక్కింతగా మెదిలిన కాల్పనికతాలత ఆ దశలో అందిన కవితలను పెనవేసి ఆయన గుండెల్లో పదిల పరిచింది. కవిత్వమొక్కటే కాదు, అనేక లలితకళలు ఆయనకు ఆత్మీయమైనవి. పండుగలకు పర్వాలకు రాజేశ్వరస్వామి సన్నిధిలో ప్రదర్శించే జానపద

రూపాలేవి ఆయన చూపులు దాటిపోలేదు. ఆ దశ దాటి పట్నంలో అడుగుపెట్టే సరికి అంతా కొత్తగా కనిపించేది. అంతా వింతగా కనిపించేది. ఎన్నిరకాల భాషలు-ఎన్నిరకాల వేషలు.

ఆ స్థితిలో పరిశీలన నిసితమైనది. పరిసరాల అవగాహన పెంపొందింది. పరిచయాలు స్నేహాలు ఒకపక్క పెరుగుతుండే పఠనాభిలాష పదింతలైంది. ఆనాడు దేశంలో వెలువడుతూండే పత్రికలనేకం అందుబాటులోకి వచ్చాయి. కవులు కళాకారులు అన్ని ప్రాంతాలవారు హైదరాబాదుకు రాకపోకలు సాగించేవారు. సురవరం ప్రతాపరెడ్డిగారి లాంటివారు 'సువర్ణ శృంగాలు' ప్రత్యక్షంగా స్ఫూర్తి నిస్తూనే వున్నారు. ఈ రకమైన పరిసరాలుగల శక్తి స్వీయ ప్రతిభకు వ్యుత్పత్తికి తోడ్పడి నారాయణరెడ్డిగారి వ్యక్తిత్వంలో వికాసాన్ని సత్వరం చేసింది. నిరంతరాభ్యాసం దానికి వన్నె పెట్టింది.

ఆయన వ్యక్తిత్వం సముజ్జ్వలంగా గోచరిస్తుంది-కవిగా-సినీ కవిగా-తెలుగు ప్రొఫెసరుగా-ప్రియ మిత్రుడిగా. సమకాలీనత, సమ్యక్ దృష్టి, సామాజిక స్పృహ, ముప్పొరిగొన్న నారాయణరెడ్డిగారి కవితలు రెండున్నర దశాబ్దాలుగా తెలుగువారికి సుపరిచితమైనవి. మాత్రా ఛందస్సులో మధురకావ్యాలు రచించిన కీర్తి ఆయనది. సాహిత్యవేదిక మీద సన్మానాలు, ఎకాడమీ బహుమతులు, ఆయన ప్రతిభకు కొలమానాలు కావు. అశేషాంధ్ర జనావళిపట్టిన నీరాజనాలు, ప్రతి తెలుగువాని పెదవులను కదిలించే పసందైన పాటలు, ఆయనలాగా రాయాలని, పాడాలని కలం పట్టిన, గళం విప్పిన ప్రతి యువకుని హృదయంలో పడ్డ ముద్రలు-ఇవి ఆయన మూర్తిత్వాన్ని అల్లంత యెత్తున నిల్పాయి.

నిరంతర పుత్సాహశీలి. ప్రసన్నగంభీర మనస్కులు. ప్రోత్సాహ పుద్యమకారులు. అలుపులేని అభ్యాస నిరతులు. ఒకపక్క సినీరంగం పిలుపులు. మరొక పక్క సమావేశాల సందడులు. ఈ నడుమ అభిప్రాయాలకోస మొచ్చే పుస్తకాలు. ఆశీస్సులకు ఆసించే యువ కవులు. సలహాలకోస మొచ్చే కార్యకర్తలు. పర్యవేక్షణ కోసం సిద్ధపడిన పర్యవేక్షణ గ్రంథాలు. సంశయ నివృత్తి చేసుకోదలచిన పరీక్షార్థులు. అక్షరరూపంకోసం ఆతురుత పడుతూ గుండెల్లో గుడిసులు తిరిగే గేయ

కృతులు. ఇన్ని ఒత్తిళ్లు ఒక్కసారి వచ్చిపడినా అన్నీ చిరునవ్వుతో స్వీకరించే కార్యదక్షులు. ప్రతి క్షణానికి విలువకట్టగల పొదుపరులు. ఆయన దైనమిజం అపురూపమైనది, అనితరసాధ్యమైనది.

అయితే యివన్నీ ఒక యెత్తు వ్యక్తిగా మరియొక యెత్తు. జీవితంలో ఝరులు పంచుకున్నప్పుడు కూడా అంతరంగంలో వెన్నెలనే నింపుకొని, వెన్నెలలు వెల్లి విరిసే రోజులలో ఝరులను కూడా తోడ్కొని – కన్నీటిని పన్నీటిని సమదర్శనం చేసే ప్రజ్ఞానిధులు. పలుకులో మార్దవం, అవగాహనలో ఆర్ద్రత, మాటలో మన్నన- ఆయన నెరగని వాళ్ళనుకూడా ఆకర్షించే ప్రవృత్తులు. స్నేహమాయనకు శిరీష పుష్పం. మాలతో దాన్ని తూట్లు పొడవటం ఆయన చిత్తశుద్ధికే విరుద్ధం. అలా పొడిచేవాళ్ళంటే అసహ్యమై పెదవి కదపక పోవటం ఆయనలో ప్రసిద్ధం. రెడ్డిగారు ఎప్పుడు అవధానంచేసినట్టు వినలేదు. కాని జీవితంలో ప్రతినిత్యం చేస్తున్నది అంతకు తక్కువేమీకాదు. ఆవిధంగా స్ఫూర్తిని, ప్రవృత్తిని సమ్మిళితం చేసిన ప్రతిభ ఆయనదైతే దానికి సముచిత స్థానమిచ్చిన ప్రతిభ ఉస్మానియాది.

(ఆచార్యవర్యుల సన్మాన సభలో డా. పోరంకి దక్షిణామూర్తి భక్తితో గురువుగా రెడ్డిగారికి అందించిన అభినందనలు )

రెడ్డిగారిని గురించి గురువులూ, శిష్యులూ, మిత్రులూ వెలిబుచ్చిన భావాలు కూడా కొన్నిటిని గ్రంథంగా వెలువరిస్తున్నాం. దీనివల్ల భావచిత్రణలో కొత్త రంగులు కొన్ని చోటుచేసుకొంటాయని నా భావన.

పూరించు పూరించు
నీ పసిడి శంఖం
వినిపించు వినిపించు
నీ దివ్య సందేశం

## "చుక్కల పందిరి"

చాలకాలం తెలంగాణా నవాబుల పరిపాలనలో ఉండటంవల్ల తెలుగు భాష, తెలుగు సంస్కృతి వెనుకబడ్డాయి. హిందువులకు కూడ ఉర్దూ నేర్వనిదే ఉపాధిలేదు. అందువల్ల అందరూ ఆ భాషకే ఎగబడ్డారు. ఇళ్లలో తప్ప స్కూళ్లలో తెలుగు ప్రమేయం ఎక్కువగా ఉండేది కాదు. అంతమాత్రంతో తెలుగు భాష మీద అభిమానం పోలేదు. అది నిద్రాణమై వుంది. అక్కడక్కడ తెలుగును, సంస్కృతాన్ని పోషించే జాగీర్దారులు, జమిందారులు ఉండేవారు. అందువల్ల ఏ కొద్దిమంది పండితులకో ఆదరణ లభించేది. దరహం మీద అందరూ ఉరుదే అభ్యసించేవారు.

అలాంటి సమయంలో తెలంగాణా స్వాతంత్ర్యోద్యమం తలయెత్తింది. అనేక మంది తమ భాషా తామూ సంస్కృతి, తాము తెలుగులోకి తేవాలని తొందరపడ్డారు. అందరికంటె ముందంజ వెయ్యటం కవులకు పరిపాటి కదా ! కవులు బయలు దేరారు. తెలంగాణా రచయితల సంఘం ఏర్పడింది. వారందరూ ఉద్యమ గేయాలె వ్రాసారు. ఈ సంఘానికి దాశరథి, కాళోజీ, వానమామలై, నారాయణరెడ్డి ప్రభృతులు అధ్యక్షులుగా నిల్చారు. ఊరూరా ఉత్సవాలు జరిపారు. ఉవ్వెత్తున లెచింది తరంగం. దానిమీద ప్రతి కవి కాళియమర్ధన నాట్యం చేశాడు. అలా చేసిన వారిలో నారాయణరెడ్డి, దాశరధి ఒక జంటగా బయలుదేరి స్వాతంత్ర్యపు పంటను పండించే రైతు సోదరులుగా నిల్చారు. తమతోపాటు ముందుకు రమ్మని అందరనీ పిల్చారు. చివరకు సమరం గెల్చారు.

వెలుతురు తొంగి చూచింది. పగలు వెన్నెల కురిసినట్లయింది. బిగపట్టిన గొంతులోనించి పకపకలు వినిపించినాయి. ప్రతి యింటా పండగ జరిగింది కవులు ఉద్యమకవితలోనించి బయటపడి ఊహాలు, ఉపజ్ఞం పెంపొందింపకొని క్రొత్త క్రొత్త కవితలు వ్రాయటానికి పూనుకున్నారు ఈనాడు వీరందరూ ప్రథమశ్రేణి కవులుగా నిల్చారు. నారాయణరెడ్డి, దాశరథిగార్లు స్వర్ణసోపానాలు అవరోహిస్తూ ఎక్కడెక్కడికో పయనించి పోతున్నారు. పక్కాల పందిరి నీడలో నిల్చి చక్కని కవితలు వ్రాస్తున్నారు. ఇద్దరూ వెండితెర కవులుగా అవతరించి అఖండ ఖ్యాతి గడించారు. వీరిలో ఒకరు ఆస్థాన కవి అయినారు. మరి ఒకరు ఆచార్యవర్యులు. ఇద్దరూ సాహితీరంగంలో అనేక హృదయాలను సింహాసనాలు చేసుకొని ఆసీనులైనారు. రెడ్డిగారు అనేక గ్రంధాలు వ్రాశారు. ఇంకా వ్రాస్తున్నారు శతాధిక గ్రంథకర్త కావడంలో ఆశ్చర్యం లేదు. వీరు ఆధునికాంధ్ర సాహిత్యం మీద పరిశోధన చేసి వ్రాసిన గ్రంథం ప్రశంసింపబడింది. తెలంగాణా మాగాణిలో వాణి వీణను మీటి విశ్వజనీనమైన రాగాలు వినిపిస్తున్న మహాకవి శ్రీ నారాయణరెడ్డి.

చీకటి తెరలను
చుట్టివేసిన వాడు
క్రొత్త కాంతులు తెచ్చి
గ్రుమ్మరించిన వాడు



# "వైతాళికులు"

---

రెడ్డిగారిని చాలామంది వైతాళికుడని వర్ణించారు. నిజానికి ప్రతి కవి వైతాళికుడే. అందులో జాగృతి కల్పించినవారు మరీని. నిద్రాణమైన శక్తుల్ని మేల్కొలిపి ప్రజలను పులులుగా మార్చగలిగినవాడు వైతాళికుడే. చీకట్లను పారద్రోల గలిగినవాడు వైతాళికుడే. రెడ్డిగారిని వైతాళికుడనుటలోగల ప్రత్యేకతను కొందరు వివరించారు. కవితాపోషణ మృగ్యమైన ఘనతవహించిన నిజాము రాజ్యములో ఒక పౌరుడుగా నిలచి తనంతట తానుగా పుంజుకున్న పౌరుషంతో బరికాచి పోరాటం గావించిన శార్దూల శాబకాలు. శ్రీ నారాయణరెడ్డి దాశరథిగారలు నిజాము పౌరులను మేల్కొలుపుటకొరకై వీరుచేసిన శంఖారావాలు ప్రజల వీపుతట్టి వెన్ను ముట్టినవి ఆ రీతిగా వీరు వైతాళికులు. కవితను అల్లుటయేకాదు క్రొంగొత్త పోకడలు పోవుటలోకూడ రెడ్డిగారు ప్రత్యేకత గడించారు. ముందుగా వీరు మాత్రా ఛందస్సులో కొత్త శక్తిని, శోభను కల్పించారు. ముక్త ఛందస్సులో కవితలు కొన్ని వ్రాశారు. ముఖ్యముగా శబ్దముల పొందికలో సిద్ధహస్తులు. అన్నిటిని మించి తమ రచనలను వినిపించి వీనులకు విందుచేయుటలో ప్రసిద్ధులు. మహావక్తగాకూడా ఆయన నవ్యాంధ్ర కవితారంగంలో వైతాళికులనిపించుకున్నారు. వీరిలోగల భావుకతను కొనియాడారు స్వామి శివశంకర స్వామిగారు. "నవ్యత వీరి కవితలో ప్రతిబింబిస్తుందన్నారు" గోపాలరెడ్డిగారు. "వారి భావన లోతును త్రవ్వుకుంటున్నది. లోతును సంతరించుకుంటున్నది, వైశాల్యతను సంతరించుకుంటున్నది" అన్నారు శ్రీ ఆవుల సాంబశివరావుగారు. "కవితా ప్రతిభా హృద్య పద్య గేయవచనోపన్యాస విన్యాస కౌశలాది గుణము లొక్కచో గుమిగూడిన అపూర్వ వ్యక్తి" అన్నారు ఆచార్య అవధానిగారు.

ఇలా పండిత హృదయాలలో చిరుగంటలు మ్రోగించుట కూడ వైతాళికుల లక్షణమే.

అంతేకాదు, రెడ్డిగారు వ్రాసిన గ్రంథాలన్నిటిలో ఏదో నూతనత్వం కని పిస్తోంది. ఇతివృత్తంలో, ఛందస్సులో కూడా. ఒక క్రొత్త విషయాన్ని వెలువ రించడం కోసమే వారి కలం యత్నిస్తోంది. చక్కటి విజయాన్ని సాధిస్తోంది. వ్యక్తులను మేల్కొల్పడ మొక్కటే కాదు వైతాళిక లక్షణం. మరుగుపడిన భావా లను వెలికితీయడం వెలుగులోకి తేవడం కూడా మేల్కొల్పే. సామాన్య మానవుడు ప్రకృతిలో, ఎదలో ఎన్నో అందాలు, సందేశాలూ దాగివున్నా వాటిని గ్రహించలేక పేదవాడుగా నిలిచిపోతాడు. కవి వాటిని అందించి పేదరికాన్ని దూరం చేస్తాడు. అప్పుడు ఒక క్రొత్తయుగం తొంగిచూస్తుంది. అలాటి భావనలనూ, భాగాలనూ ఆవిష్కరింప కలిగిన కవి వైతాళికుడు కాదా మరి.

పసివాని భావనలు
పలుకుగా మారె
పండి వొరిగిన గుండె
పాటగా మారె !

## "వెండి త్రాసు"

---

నారాయణరెడ్డిగారి తొలి సినిమా పాట "నన్ను దోచుకుందువటే వన్నెల దొరసానీ" అనేది గులేబకావళిలో గుబాళించింది. ఒక్క పాటతో సినిమాలోకం ఆయనను గుర్తించింది. ఈ పాట తర్వాత ఆయన కలం రెక్కలు చాచుకొని ఎక్కడికి పడితే అక్కడికెగిరి ఎక్కడ పడితే అక్కడ ఆగి పాటలల్లుకుంది. ప్రతి పాటలో పన్నీటిజల్లు కురుస్తోంది. ఈ పాటలు సంపాదించి పెట్టిన కీర్తిని ఆయన తన హృదయంలో ఒక వెన్నెల గుడారం వేసుకొని దాచుకుంటున్నారు.

రెడ్డిగారి పాటల కలం మూడు వేల అంకె ముట్టుకోబోతోంది. ముట్టుకుంటుంది. పది వేలదాకా పరుగులు తీస్తుంది. ఫిలిం ప్రపంచంలో ఏ భాషలోనూ యిన్ని పాటలు రాసిన వారరుదేమో ! అసలు అగ్రతాంబూలం యీయనదేనేమో ! దీనివల్ల రెడ్డిగారి రచనాపటిమ, ప్రావీణ్యత. పాండితీగరిమ ద్యోతకమవుతుంది. ఏ రచనలు చూసినా జూరుగుపత్తిలాంటి మెత్తటి పదాలు కనిపిస్తాయి. వీటిలో పరిమళం అపరిమితం. వీటిని వింటుంటే కుంకుమ పూవు మాగాణుల మధ్య గట్టువెంట గాలి పీల్చుకుంటూ షికారు చేస్తున్నట్లుంటుంది.

పాటకు ప్రాణాలు రెండు. ఒకటి వాణి - రెండు బాణి. ఒకదానితో ఒకటి పోటీ పడుతూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు ఒకటి పై చేయిగా మారి మాధుర్యాన్ని తగ్గిస్తుంది. రెండూ అక్కచెల్లెళ్లలాగా అన్యోన్యతగా సంచరించాలి. పరస్పర గౌరవాన్ని ప్రసాదించుకోవాలి. అంతేగాని అత్తాకోడళ్ల సరళి ప్రమాద కరం.

రెడ్డిగారి పాటలలో యిలాంటి యిబ్బంది లేదు. ఆయన మాటలు సంగీతాన్ని మచ్చిక చేసుకుంటాయి. మాలిమితో కులుకుతూ ముందుకు సాగుతాయి. మాధుర్యాన్ని గ్రుమ్మరిస్తాయి. మనసుల్ని అలరిస్తాయి. వీరి పాటలలో ప్రతి పంక్తి ఒక సరళిని గుర్తుకు తెస్తూ ఒక స్వరానికి ముడిపెడుతూ వుంటుంది. రెడ్డిగారు కనిపించని గాయకుడు భాషాపరంగా చూస్తే గొప్ప వైతాళికుడు.

ఈ సంపుటిలో వీరు రాసిన పాటలు ఎందరెందరి గుండెల్లోనో అల్లుకు పోయినాయి. నేను ఒక్కడనుగా కొన్నిటినేరి బయటపెట్టడం అభిమాని లక్షణం గాదు. పండిన పది ఎకరాల ప్రత్తి చేలో ప్రవేశించి పది వత్తులు మాత్రంచేసి బయటికి రావటం ఎంత భావ్యమో యీ ఎన్నికకూడ అంతే తోటలో ప్రత్తినంతా వత్తులుగా మార్చగలిగితే కోటి దివ్వెలు వెలిగించవచ్చు.

పాట కోయిల గూడు. పలుకులు పంచమస్వరాలు. అందువల్లనె మృదువైన, సరళమైన భాష పాటకు కావాలి. అలాటి పదసంపద రెడ్డిగారి ఖజానాలో కొల్లలుగా వుంది. భావానికనువైన భాషను తెచ్చి ఆకర్షణీయంగా మలచడంలో యీయన సిద్ధహస్తుడు. అవసరమైతే సమాసాలను పొగసుగా అల్లగలరు. సాధారణ సన్నివేశాలలో వాడుక భాషను ప్రయోగించగలరు. జానపద శైలిలో అనువైన పదజాలం యీయనకు కరతలామలకం. వీరి పాటలలో యమునా తరంగాలు - నందనవనాలు–బృందావనాలు–నవపారిజాతాలు–నవగీతాలు– తరిపి వెన్నెలలు–సైకత వేదికలు–వీణలు–వేణుగానాలు– యిలా ఎన్నెన్నో మధుర రవళులు కన్పిస్తూ వుంటాయి. శ్రోతల హృదయాలకు ఒకప్పుడు అమృతాభిషేకం చేస్తూ వుంటాయి. ఒకప్పుడు వాటిపై సుమహాసలు వెదజల్లుతూ వుంటాయి. ప్రతి పాటను ఒక ముత్యాల మూటగా సంతరించడం వీరిలో గల ప్రత్యేకత.

సుమారు 20 సంవత్సరాల క్రింద మద్రాసులో ఒక ఫిలిం పాటల రచయితను సత్కరించడం జరిగింది. ఆ సభలో ఒక పండితుడు ప్రసంగిస్తూ (సినిమా పాటల్లోగూడ ఉత్తమ సాహిత్యం కొత్తగా చోటు చేసుకుంటోంది) అన్నారు. అది అప్పటి వరకూ వచ్చిన సినిమాపాటల సాహిత్య సింహావలోకనం అయివుండవచ్చు.

కాని అది పరమసత్యం కాదు. అప్పటికే కొన్ని కలాలు సాహిత్యాన్ని ఉత్తమగతిలో చిత్రించి రాగాలకు భోగాలు కల్పించినాయి. ఇప్పటి సినిమా సాహిత్యంలో భాషకు కొదువలేదు. ఉత్తమ భావన నిషేధించదు. సంఘటననుబట్టి సంవిధానాన్ని బట్టి ఉత్తమసాహిత్యం ప్రయోగింపబడుతుంది. అలా ముస్తాబైన భావనాపటిమనుబట్టి పాటలు ప్రేక్షకహృదయాలను ముగ్ధులను చేస్తునేవున్నాయి. రెడ్డిగారి పాటలలో రెండు తరగతులున్నాయి ఉత్కృష్టమైన సాహిత్యం, రసస్ఫూర్తిని కలిగించే వాడుకభాష వీరి కలంనుండి సరళంగా సహజంగా జాలువారుతూ వుంటాయి.

రెడ్డిగారి పాటలలో అందాలను భావనలను పేర్కొనాలంటే అది పెద్ద కావ్యమే అవుతుంది. ఒకటి రెండు పాటలు మాత్రమే ఉదహరిస్తాను.

"మల్లియలారా మాలికలారా మౌనముగా వున్నారా
మా కథలే విన్నారా".

ఈ పాటలో బాహ్య సుందర ప్రకృతులను ఒకటిచేసి ముడివేసి నిలవేసి కథ చెప్పుతున్న రీతి కనిపిస్తుంది. మానవుడు సమాజ జీవి ప్రకృతి పరమాత్మ స్వరూపం. ప్రకృతిని పరిశీలించి అందులోగల అనంతశక్తిని తనలోకి తెప్పించు కోవటంకోసం, ఒప్పించుకోవటం కోసం మానవుడు తాపత్రయ పడుతూ వుంటాడు. కన్ను ప్రకృతి సౌందర్యాన్ని దోచుకోవడానికి ప్రయత్నిస్తూ వుంటుంది. గుండెలు ప్రకృతిలోగల అనంత శక్తిని అన్వేషించి కొత్త వూపిరిగా పీల్చుకోవటానికి అహరహం ఆరాటపడుతూ వుంటాయి. ఇది పవిత్ర బాంధవముద్ర. తను ప్రకృతిలో లీనం కాలేక ప్రకృతిని తనలోకి తీసుకోటం కోసం నరుడు తాపత్రయపడటంలో సహజధర్మం వుంది. ఎందువల్ల ? ప్రకృతిలో ఎంత సౌందర్యమున్నా, ఆధ్యాత్మిక భావనవున్నా, సృష్టి వైచిత్ర్య చిత్రణమున్నా మానవుడు ఆద్యంతాలను ముడిపెట్ట లేడు. అవి ముడిపడే చోటు ఒక్కటే. అది మానవ హృదయం. అందుకనే అన్ని శక్తుల్ని అక్కడ చేర్చుకోటానికి మానవ హృదయం ఉక్కిరి బిక్కిరవుతూ వుంటుంది. ప్రకృతిని పలంకరించి పులకరించటం రెడ్డిగారికి తెలుసు.

"ఈ నల్లని రాలలో ఏ కన్నులు దాగెనో
ఈ బండల మాటున ఏ గుండెలు మోగెనో"

దీనికి జవాబు ఎన్ని యుగాల వెనుకకో వెళ్ళి వెతుక్కోవాలన్పిస్తుంది. స్థాణువులకు ప్రాణాలున్నాయని, పలుకరించగలవని, నవ్వులు గిలకరించగలవని, పూవులు పూయించగలవని ఆయన గ్రహించి యీ పాట వ్రాసారు. కవి హృదయం ఒకే కొలానికి కట్టుబడి వుండదు. భూతాన్ని వెతుకుతుంది. వర్తమానాన్ని అనుసరిస్తుంది. భవిష్యత్తుని దర్శిస్తుంది "త్రికాలజ్ఞత" మానవ జీవన సరళికి మురళీ నాదం వంటిది. యిలాటి అన్వేషణ రెడ్డిగారి పాటలలో మాటిమాటికీ స్ఫురిస్తుంది.

రెడ్డిగారి పాండిత్యాన్ని, ప్రతిభను ప్రతిబింబింపచేసే పాటలు చాల వున్నాయి. "శివరంజని" వంటి పాట, "మేలుకో కవిరాజ మేలుకోవయ్యా" అనే క్షేత్రయ్య పాట కొన్ని ఉదాహరణలు. యీ రెండవ పాటలో అష్టవిధ నాయికలు ఒక్కొక్కరే మన ముందు నడిచిపోతున్నట్లుగా చిత్రించారు. పాట ఎంతో వయ్యారంగా నడిచింది. సంగీతంతో పందెం వేసింది. పాట వింటుంటే మందాకిని అలలలో కలువలూగినట్లు, మంచుదుప్పట్లపై కన్నె హంసలు చక్కగా రెక్కలు విచ్చుకున్నట్లు, పుచ్చపూవు వెన్నెలలో జ్యోత్స్నాభిసారిక మేలిముసుగు జలతారు అంచులు మిలమిలలాడినట్లు వుంటుంది–నవ్య భావనతో, దివ్యగానంతో.

ఈ పాటలకు వెలకట్టడమెలా ? ఒక్క చిన్న పాట కట్టి ముగిస్తాను –

వెన్నెల అంగడిలో
వెండి త్రాసులో
కవితను తూచే ఓ వ్యాపారీ
ధర ఎంతోయీ రెడ్డి పాటలకు?

("పగటి వెన్నెల" కునేను వ్రాసిన పీఠిక నుంచి)

మనసునం దెంతటి
మార్దవము కలదొ
అది అందాల మందార
కింజల్కమేమొ



# "మనసు మంచిది"

మూడు నాలుగు దశాబ్దాలుగా పండితులచేతా, భాషాప్రియులచేతా కొనియాడ బడుతున్న రెడ్డిగారికి సంబంధించిన ప్రశంసలు ఇన్నా ? అన్నా ? అన్నిటిని సంతరించి ప్రచురించటం సాధ్యంకాని పని. చెయ్యగలిగితే ఆ గ్రంథం మొయ్య లేని బరువవుతుంది. అందినంతవరకు కొన్నిటిని యీ గ్రంథంలో పొందుపరచాలనే ఆసక్తి కలిగింది. "ఒకరన్నది నీలో వున్నది" అనే సూక్తిననుసరించి ఈ ప్రశంసలు రెడ్డిగారి ఆత్మను చాలవరకు ఆవిష్కరిస్తాయి

అలనాటి భావకవులందరికి అన్నగారూ, బహుభాషా కోవిదులూ, సాహితీ సమితి స్థాపకులూ అయిన శ్రీ తల్లావఝ్ఝల శివశంకరస్వామి వారు "ఉపన్యాసము వినసొంపుగ నుండును. స్పష్టమైన వాక్కు, సుశబ్ద ప్రయోగం, ఉత్తమ భావుకత, ఒక రకమైన మాధుర్యం ఉపన్యాసములో ఉద్దీప్తి నొందుచుండును. నారాయణరెడ్డి ఉత్తమ వక్త. ఉత్తమ గీతికా రచయిత" అన్నారు. స్వామీజీ అన్న మాటల్లో ప్రశంస మాత్రమే కాదు ఆశీర్వాదం కూడ ఉన్నది.

చాలకాలం క్రిందట కరీంనగర్‌లో నారాయణరెడ్డి సన్మానోత్సవం మూడు రోజులు జరిగింది. ఆ సభలకు వెళ్లారు శివశంకరస్వామిగారు. ఒక యువకవికి తొమ్మిది పొద్దులు జరిగిన ఆ సన్మానానికి పొంగిపోయారు. ఆ ప్రశంసలాలకించి పులకితులయ్యారు. నారాయణరెడ్డిగారు యౌవన దశలోనే గొప్పవారనిపించు కొన్నారు. ఇప్పుడింకెంతో పెరిగారు. సాహితీవేత్తలూ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ రథసారథులూ, సరసులూ అయిన బెజవాడ గోపాలరెడ్డిగారు నారాయణ

రెడ్డిగారికి చిరపరిచితులు, మిత్రులు. అకాడమీలో ఎనలేని గౌరవం లభించింది రెడ్డిగారికి. ఆ మైత్రిని పురస్కరించుకొని గోపాలరెడ్డిగారు తమ కవితా హృదయాన్నిలా వెలువరించారు——

"నారాయణరెడ్డిగారు తెలంగాణా నూతన జాగృతికి వైతాళికులలో ఒకరు. తెలుగుకు ఆదరణా, పోషణా లేని నైజాం రాజ్యంలో పుట్టి తమ నూతన రీతులతో, కల్పనలతో, శబ్ద చమత్కారములతో ఆంధ్రుల చకితమొనరించిరి".

ఆత్మవిశ్వాసంతో, సరళతతో, సరసతతో ఎవరిని నొప్పించకుండా అందరితో కలసిమెలసి వర్తించువారు నారాయణరెడ్డిగారు. ఆంధ్ర దేశములో అన్ని ప్రాంతములకు వారి సాహిత్యము సాంస్కృతిక సేతువై, ఆనందహేతువై వెన్నెల విహారము చేయుచున్నది.

నిర్మల సాహిత్య సీరములు నేడు తరంగములై ఎగిరెగిరి చిందుచున్నవి. ఈ తరంగిత సాహిత్యార్ణవములో తన కవితా తరణుల పదిలముగా తేల్చగల కర్ణధారి నారాయణరెడ్డి.

"వాని కవితా ప్రసూన కూజితములు
వాని కల్పనా విహంగ సౌదామినులు
వాని సరళ హృదయ సౌరభముల
తెలుగునాడు కలకాలము అనుభవించుగాత. వానికివే నా శుభాకాంక్షలు.

ఎవరెవరిదాగొంతు 

ఎల్లలన్నిటి దాటి

నాల్గు చెరగులవరకు

నవ్వుతూ పరుగెత్తు

## "ఆకాశం చిన్నది"

---

కవికూడ చంద్రునివంటివాడు. మనసు అతి విశాలం. అది విశ్వమంతా సంచరిస్తుంది. దిశాంతరంలోకి తొంగిచూస్తుంది. సకల మానవకోటిని బంధు సముద్రులుగా భావిస్తుంది. నైలునది లోయలో పత్తిచేలో పనిచేసే పడుచుకత్తె కోనసీమలో కొబ్బరి తోటలో పనిచేసే పడుచుకత్తె అక్కచెల్లెండ్రు. అందాలు ఒకటే. బంధాలు ఒకటే. స్పందన ఒకటే. కాలిబింమలు ఒకటే. అలాగే దూరదూరాన ఉన్న ఒక పడుచువాడు దండాపుల్లోవున్న ఒక పడుచువాడు అన్నదమ్ములే. ఆశయాలు ఒకటే, జీవితం ఒకటే, అనుభూతులు ఒకటే.

కవి మనస్సు అందరిమీదకూ పరుగులు తీస్తుంది. అతడందర్ని గురించి వ్రాస్తాడు. వేడుక, విషాదము అన్ని వుంటాయి ఆ కవితలో కవి గుండె కరిగి కరిగి పరుగులు తీసి ఒకప్పుడు ఒక పవిత్రుని పాదాలుకడుగుతుంది. ఒకప్పుడు ఒక పసివాని తలపై చినుకులుగా కురుస్తుంది. అతని పరిధి విశ్వమంతా ప్రాకులాడుతుంది. ఆంబధాలు దాటి అక్కడగల సీమలను దర్శించాలని చూస్తుంది. అక్కడగల అందాలను అందుకోవాలని వాంఛిస్తుంది. కాని కవికి సామాన్యంగా ఏ ఒక్క భాషో-అంటే మాతృభాష ఎక్కువగా అలవడుతుంది. అతడాభాషలోనే కవితలు వ్రాస్తాడు, గళమెత్తి పాడుతాడు, మాతృభాషా యోషకు నీరాజనాలందిస్తాడు. తన పాటలతో మాటలతో తోటివారిని పలకరిస్తాడు. పండుగ చేసుకుంటాడు. ఏ భాషకాభాషకు ఒక సాహిత్యాకాశముంటుంది. ఆ ఆకాశపుటంచులవరకే అతని కవితలు ప్రతిధ్వనించే అవకాశముంటుంది.

ఎక్కడో దూరదూరాన తన భాషకు చెందినవాడు ఒక్కడో పదిమందో వుంటే అక్కడికి ఈ పాటలూ మాటలూ పరుగులుతీయడం ఎక్కువగా సాధ్య పడదు. అందువల్ల తన అవకాశంలోనే తన ఆకాశపునీడనే కవి తన సాహిత్యాన్ని సృష్టించుకుని సంతుష్టి చెందుతూవుంటాడు ఈ ఆకాశాన్ని దాటి కవిత పరుగులు తీయాలంటే యితర భాషలలోకి అనువదింపబడాలి. అలా అనువదింపబడిన రచనలు విశ్వవ్యాప్త మవుతాయి. కవి విశ్వకవి అవుతాడు.

మన తెలుగు ఆకాశం చాలా చిన్నది. అనువాదాల ద్వారా యీ ఆకాశాన్ని పెంచాలి కవుల ఉత్తమ రచనలన్నీ అనువదించడం ఒక్కటే మార్గం. రెడ్డిగారికి మూడు నాలుగు భాషలు వచ్చు. కొన్ని భాషలలోనించి గ్రంథాలు అనువదించారు. వారి గ్రంథాలుకూడా యితర భాషలలోనికి అనువదించబడాలి. తెలుగు కవులందరి ఉత్తమ రచనలు ఇతర భాషలలోకి ప్రాకిపోవాలి. అలా ప్రాకటంవల్ల కవి ప్రతిభను, పాండిత్యాన్ని, ప్రత్యేకతను, తెలుగు భాషలోని సొగసును లోకానికి పంచియిచ్చి నట్లవుతుంది. అసలు యీ కార్యక్రమాన్ని అకాడమీలద్వారా ప్రభుత్వం నిర్వహిం చాలి. దీనికిగాను ప్రత్యేకించి ఒక అకాడమీని స్థాపించినా మంచిదే. రెడ్డిగారి విషయంలో — నాగార్జునసాగర్, కర్పూర వసంతరాయలు, మానవుడూ మంటలూ, ఋతుచక్రం, త్వరలో వెలువడనున్న విశ్వంభర యితర భాషలలోకి అనువదింప బడాలి. ఒక తెలుగు కవి పాట కాశ్మీరీ భాషలో అనువదింపబడి ఆ మంచు కొండ సానువులలో ఏ పండితుడో, ఏ గాయకుడో యెలుగెత్తి పాడినపుడు తెలుగు సరస్వతి తలయెత్తి ఆ శిఖరాలవంక చూస్తుంది. తన ఆనందాన్ని అందరికీ అందిస్తుంది.

అతిధి వచ్చాడమ్మ
అతిధి వచ్చాడు
పాలపిట్టా నీవు
పట్టవే గొడుగు



# 'ఎడద వాకిట పీట'

అతిధి విష్ణువుతో సమానం అన్నారు పెద్దలు. అతిథులు తమ వెంట ఆత్మలు తెస్తారు. ఆత్మ వెలుగు. ఆత్మ వెన్నెల. అలాంటి వెలుగు తెచ్చిన వారిని గౌరవించడం గృహస్థ ధర్మం. అంతేకాదు, అది మహద్భాగ్యం కూడా. అతడు తెచ్చిన వెలుగునందు కొని ఎన్నెన్ని రీతులుగానో సత్కరించాలని గృహస్థు అభిలషిస్తూ వుంటాడు తను మాత్రమేగాక తన కుటుంబంలో వారందరినీ అతిధిసేవ చేయమని కోరతాడు.

కుచేలుడు బాల్యమిత్రుడైన కృష్ణుని చూడటానికి వచ్చినప్పుడు ఆ యదు నందనుడు రుక్మిణిని పిలచి "అతిధి పాదాలు వత్తడంలో నేను దాసుణ్ణి, నువ్వు దాసిగా రావాలి" అంటాడు.

తన శక్తి చాలదని భావించి ఇతరులనుకూడ సహాయం కోరడం సత్పురుషుల లక్షణం. ఎన్ని రీతులుగా సేవచేసినా తనివితీరదు. అతిధికి కొంత ఆత్మశాంతి కల్పింపచేయడమే గృహస్థు ఆశయం.

అతిథులలో ఆప్తులైనవారు వచ్చినప్పుడు ఎడద వాకిట వెండి పువ్వుల పీట వేయడం సహజం. అప్పుడుగాని గృహస్థు తృప్తి చెందడు. ఇలాంటి గౌరవం పొందిన అతిధి దీవించడం గృహస్తు మనసులో మల్లెలు పూయించడం జరుగుతుంది.

నారాయణరెడ్డిగారు అతిధి సత్కారంలో మునిగి ముచ్చటలు పడుతూ వుంటారు. వచ్చినవారు పరిచితులైతే వారి అభిరుచులు గుర్తుపెట్టుకొని వారినిపలక రించటం జరుగుతూ వుంటుంది. ఒక మిత్రుణ్ణి భోజనానికి వుండమన్నారట. ఆయన

అంగీకరించారట. రెడ్డిగారు "మీ భోజనం అలవాట్లు నాకు తెలుసు– ఆప్రకారమే వంట చేయించాను" అన్నారట.

"మరి మీ అలవాట్లు?" అన్నాడట అతిథి

"అతిథి అలవాట్లే ఆ రోజు అందరి అలవాట్లుగా మారాలి. అలా కాకపోతే అతిథి తృప్తి చెందడు. అతిథి కడుపునిండ తిన్నప్పుడే గృహస్థు ఆనందం. మనసు నింపితే చాలదు, కడుపుకూడా నిండాలి. అదే ఉత్తమ గార్హస్థ్య ధర్మం" అన్నారట రెడ్డిగారు.

ఇంటికి వెళ్ళిన వారిని చక్కగా పలకరించటం, చిరునవ్వులు చిలకరించడం, అవసరమైతే గుండెలు గిలకరించడం రెడ్డిగారికి తెలుసు.

ముందు ముందుకు సాగె
ముక్త కంఠమ్ము
అందు కలిసినదొక్క
అమృత కంఠమ్ము

## "క్రొత్తగొంతు కావాలి"

---

భావకవిత్వం సారస్వతంలో చోటుచేసుకొని చాలాకాలమయింది. దానిని ఒక యుగంగా భావించారు. కొందరు ఛందస్సులను వినియోగిస్తూ క్రొత్త క్రొత్త పోకడలులో పోయారు. భాషలో వంపులూ సొంపులూ ఏర్పడినాయి. ఇతివృత్తాలు తమ తమ చిత్తాల్ని అనుసరించి వచ్చినాయి. కొందరు విరహాన్ని వస్తువుగా చేసుకున్నారు. అక్కరలేని వేదన అనుభవించారు. ఇదినేనన్న మాటకాదు – ప్రఖ్యాత కవి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు ఒకసారి ప్రసంగిస్తూ, "ఎందుకీ భావ కవులిలా బాధపడతారు? కనిపించని వ్యక్తికోసం కన్నీళ్లు పెడతారు? ఊహించుకొని గాలి ఉయ్యాలలూగుతారు. కనిపించేవాన్ని గురించి ఏమైనా వినిపించ గూడదా," అని విమర్శించారు.

అయితే యీ విమర్శనల నెవరూ అప్పుడు పట్టించుకోలేదు. వారు పడేది తియ్యటి బాధ. ఆ తీయదనాన్ని ఎలా పోగొట్టుకొంటారు? అందువల్ల కన్నీటిలోనే కలంముంచి వ్రాసారు పాత సాంప్రదాయం పక్కనే యీ నూతన సాంప్రదాయం పెరుగుతూవచ్చింది. భావ కవుల్ని చూసి నవ్వేవాళ్ల నవ్వారు. పువ్వులు రువ్వేవాళ్ల రువ్వారు. ఒక కవి నన్ను "మనసారగా ఏడ్వనీయండి" అని కూడ చెప్పుకున్నారు. ఈ యుగంలో ముఖ్యంగా శృంగారమే వస్తువుకావటంవల్ల అందరి గొంతులూ ఒకటిగానే వినిపించినాయి. మొత్తం మీద కవిత్వంలో నవ్యభావనలో నైరాశ్యం తొంగిచూసింది. ఆ సమయంలో నండూరివారు ఎంకిని కథానాయిక చేసారు. ఆమె కూడ ఊహాసుందరే! ఆవిణ్ణి గూర్చి మరింత తేలిక భాషలో పాటలు వ్రాసారు. వాటిని కొందరు చేటలతో చెరిగివేశారు. కొంధరు మురిసి మురిసి ముత్యాల మూట

లుగా దాచుకున్నారు. ఇదంతా భావ కవిత తెచ్చినమార్పు. ఛందస్సుని దగ్గరికి రానీయకుండా చేయాలనే సంకల్పం కూడా కొంత వీరిలో తొంగిచూచిందేమో గ్రాంథికాన్ని మూటకట్టి వేశారు. వ్యవహారిక భాషను విరివిగా వాడుకున్నారు భావ కవిత్వంలో యిది వొక తరం.

తరువాత వీటి ప్రభావం కొంత తగ్గింది. అనుకున్నంత క్రొత్తదనం కనుపించలేదు. కలాలు వేరైనా కవితలు వొకటేననే అసంతృప్తి కలిగింది. అందు వల్ల మరియొక మార్పుకోసం కవులు ప్రయత్నించటం ప్రారంభించారు.

వాస్తవికత కవితలో ప్రతిబింబించాలి అనే భావన వీరికి కలిగింది ఆ పద్ధతిలో కవితలు వచ్చినాయి. భగ్నహృదయ భావనలనుంచి కవులు మేల్కొని నగ్న చిత్రణ కోసం ప్రాకులాడారు. వీరిలో చాలామంది సమాజాన్ని దర్శించి దానిలో కనిపించిన దోషాలను వెలికితీసి కవితలల్లారు. ఈ రచనలలో కొంత సమాజదర్శనం వున్నా సహజస్వరూప చిత్రణ వున్నా కవిత్వ రచన మరొక మలుపు తిరగవలసి వచ్చింది. అప్పుడు అనేక రకాల కవితలుద్భవించినాయి. వచన కవిత్వం వచ్చి వొక క్రొత్త సొగసు తెచ్చింది. ఈ రచనలుకూడ కొంత కాలం తమ శక్తిని ప్రదర్శించి క్రమంగా నిలబడిపోయినాయి. క్రొత్తదనం మృగ్యం కాజొచ్చింది.

'మరో గొంతు కావాలి' అనే భావన కొందరిలో ఏర్పడింది. సమాజంలోగల ఛిద్రతనూ దౌష్ట్యాన్ని, దమన నీతిని, తారతమ్యాలను చెరిపివేయాలని వీరు వుద్దేశించారు. మానవుడు తలయెత్తగల స్థితి ఏర్పడాలంటే హృదయాన్ని మేల్కొల్పాలి. మానవతకు మంగళగీతం పాడాలి. దీనితోపాటు కవనాన్నికూడ క్రొత్త కల్యాణ మంటపం కట్టాలి — ఈ ప్రయత్నంలో ముందుకు వచ్చినవారు శ్రీ నారాయణ రెడ్డిగారొకరు. వీరు తొలుత మాత్రా ఛందస్సులో కవితకు మణి హారాలు కట్టారు. తనకున్న భావనా శక్తితో, లో చూపుతో మానవతా శక్తితో కవితలల్లారు. అవి పాఠక లోకాన్ని మురిపించినై. కొన్ని కొన్ని మై మరపించినాయి కూడ. తరువాత వచన కవిత్వంకూడ చేపట్టారు. మధ్యతరగతి మందహాసం వంటి మధుర కావ్యాన్ని సృష్టించారు. అదికూడ వొక మలుపుగా భావించబడింది. వచన కవిత్వ

నిర్మాణానికి భావనా శక్తి అవసరం. ఛందస్సు తేగలదన్న బలం యిక్కడ మృగ్యం. అందువల్ల ఆ బలాన్నికూడ భావనలోకి జొప్పింపి కవితనే ప్రావీణ్యాన్ని కలంలోకి రప్పించి వ్రాయాలి. ఈ విషయంలో కూడ వీరు కృతకృత్యులైనారు. రెడ్డిగారి కావ్యాలన్నిటిని పరిశీలిస్తే ఆయన వొక నూతన యుగం కోసం ప్రయత్నించినట్లు తోస్తుంది వట్టి కవితా గవేషణేగాదు, యుగ పరివేక్షణ కూడ వారి రచనలలో గోచరిస్తుంది. అందుకే "నారాయణ రెడ్డి యుగం" అని కొందరు పేర్కొంటూ వుంటారు.

దిశాంతాలలో వినిపిస్తాం 

దేమిటా ధ్వని ?

దిక్కులేని వాని మూల్గు

దిక్కుదిక్కునా ప్రతిధ్వనిస్తోంది

# పిపుతట్టి-కలంపట్టి

---

కవికి సహజంగా మానవత మీద అభిమానముంటుంది. మానవతను పరిరక్షించే బాధ్యత కూడా కవిదే. అదే సమాజరక్షణ. అదే ధర్మ రక్షణ. మానవ హృదయాన్ని మలిమసం కాకుండా కాపాడటం కన్నా గొప్ప సేవ యేముంటుంది? ఈ ఆధునిక యుగంలో కవులందరి కలాలు ఈ ఉత్తమ సేవలో మునిగి ముచ్చటలు పడటం గమనించదగిన విషయం. తనలో గల హృదయమే అందరిలో కలదని కవికి తెలుసు. కాని కవి హృదయానికి గల స్పందన కొన్నిటిలో మృగ్యం. మానవత లోపిస్తే జాతి మనుగడకే లోపం సంభవిస్తుంది. ఈ మనుగడకోసం కవి ధర్మ యుద్ధం సాగిస్తాడు. కొత్తకొత్త ప్రవచనాలు వినిపిస్తాడు. రస్కిన్ మహాశయుడు చెప్పినట్లుగా పడిపోయిన హృదయాలను లేవనెత్తి ధర్మం, సత్యం, దయ, దానం అనే నాలుగు స్తంభాలపైన నిలబెట్టటానికి ప్రయత్నిస్తాడు. ఇది నిజమైన జాతీయతా ధర్మం.

బీద వాళ్ళను చూసి కన్నీరు కార్చని కవి వాటితో అతని హృదయాన్ని కడిగి స్ఫటికం చెయ్యలేని కవి ఉత్తమకవి అనిపించుకోలేడు. చుట్టు గుడిసెలో, నులక తొట్టి మంచంలో పడిమూల్గే బీదవాని పిలుపు విని పరిగెత్తుతాడు కవి. తన యెడదను విడిదిచేసి ఆతనికి విశ్రాంతి కల్గించిన వాడు కవి. పేదతనం హృదయానికి సంబంధించినది కాదు. జీవితానికి సంబంధించినది కాదు. అది జీవనానికి సంబంధించినది. ఎవరెలా జీవించినా మానవులే.

ఈభావనకల కవులలో ముఖ్యులుగా నారాయణరెడ్డి గారిని పేర్కొనవచ్చు. అందుకనే అన్నారు—

"పేదవాని బ్రతుకు దారి
తెలవారని చీకటి
దాచుకున్న దేమిటి
ఆరిపోని ఆకలి"

—అని పరితపించారు. పేద సాదల జీవితంచూసి ధనవంతులు,దర్పం కలవారు ఈసడించు కోవచ్చు. వారిని మనస్సులో నుండి దూరానికి తోసివేయవచ్చు. కాని కవి అలా చేయలేడు.

తను వారి ప్రతినిధిగా నిలుస్తాడు వారిని కూడా ప్రగతిపథంలో నడిపించ టానికి ప్రయత్నిస్తాడు వాడూ మానవుడే, మనలోటి మానవుడే, మనసున్న మానవుడే అని నిరూపించటానికి ధైర్యంగా నిలుస్తాడు.

"తాజమహలులో కురిసే వెన్నెల
పూరిగుడిసెపై కురియదా
బృందావనిలో విరిసే మల్లియ
పేద ముంగిట విరియదా !"

ఒక లోకసత్యాన్ని, అందరకూ తెలిసిన సత్యాన్ని, తెలిసి మరిచిన సత్యాన్ని పై పాటలో గొప్పగా చాటిచెప్పారు నారాయణరెడ్డిగారు. చదివినా, పండితుడైనా సంపాదించినా, సంపన్నుడైనా, పదవినందుకొన్నా అధికారియైనా, ప్రక్కన చేరినా బంధువుగా మారినా—అందరిలో ఉండవలసింది మమత. మమత అనేది అందరికీ తెలిసిన సత్యం. కాని అందరిలో మమత వున్నదనే సత్యాన్ని ఎందరెందరో మరిచి పోతూ వుంటారు. మాట, మమత మహత్తరశక్తి. మణుల కన్న మాణిక్యాలకన్న విలువైన సంపద. మనిషి వెనుక మమత దాక్కొని వుంటుంది. మనిషితో నడుస్తుంది. మనిషిని మనిషిగా నిలబెడుతుంది. మమత లోపిస్తే మనిషి రూపమే మారుస్తుంది. అందుకే రెడ్డిగారన్నారు—

"చదువు రానివాడవని
దిగులుచెందకు-మనిషి
మదిలోన మమతలేని
చదువులెందుకు"

ఈ మమతా శక్తిని వెలార్చటంలోనే మానవతను పూజించడం జరుగుతుంది. మాన వతా వాదిగా రెడ్డిగారు తమ రచనలలో ఎన్నిచోట్లనో కనిపిస్తారు. ఒక చోట పేదవాని కన్నీరు తుడుస్తున్నట్లు. ఒకచోట అతనిపై పన్నీరు చిలకరిస్తున్నట్లు, ఒక చోట సందిటలోకి తీసుకున్నట్లు, ఒక చోట అతని తలపై వెన్నెల పందిరల్లుతు న్నట్లు, పువ్వులు జల్లుతున్నట్లు, ఒక చోట వీపు తట్టినట్లు- కలంపట్టినట్టు.

క:వ్యామృతము దెచ్చి 
కలబోసి, వడబోసి
అందించ గలవాడే మేటి
అధ్యాపకుండు

# అధ్యాపకులుగా

---

తెలుగు తరగతులకు కూడా హుందాతనం తేవడం కొందరు గురువులకే తెలుసు. అతి తియ్యటి తెలుగును మరింత మధురంగా మార్చే నైపుణ్యం వున్న వారు అరుదు. అలాటి వారిలో ఆచార్య నారాయణరెడ్డిగారొకరని చెపుతారు. ఊసులతో సొల్లాటి బాసలతో కాలం వృధా చెయ్యకుండా – రాగానే పుస్తకం విప్పి పాఠం మొదలు పెట్టడం, క్లాసులోవారు మంత్రముగ్ధులై వినడం రెడ్డిగారు క్లాసులలో కల్పించుకొన్న వాతావరణం.

"పాఠం చెప్పడంలో రెడ్డిగారి ప్రత్యేకత ఏమిటి ?" అని ఒక విద్యార్థిని అడిగాను. "ఆయనగారు పద్యం చదవడంలోనే ఎంతో శ్రావ్యతవుంది. అందువల్ల వినాలనిపిస్తుంది తరువాత ఆయన చెప్పే భావాలు అతి గంభీరంగా వుంటాయి. పైపై అర్థాలు కాక ప్రతి విషయాన్ని పరిశీలించి పరిశోధించి ఆ విషయాన్ని విడమరించి చెప్ప కలిగినంతంతా చెపుతారు .. "ఈ విషయంలో ఇంకా మిగిలిందేమున్నది?" అనేదాకా ఆయన చెపుతారు. అసలు ఇంటికి వెళ్ళి మళ్ళీ చదువుకోవాలనిపించదు" అన్నాడా విద్యార్థి.

"పాఠం చెపుతుండగా విద్యార్థులేమైనా ప్రశ్నలు వేయడం వుంటుందా !" అని మరి ఒకరిని అడిగాను.

"మంచి ప్రశ్నలు వేస్తే ఆయన ఎంతో గౌరవంగా వివరించి చెపుతారు. సంశయాలు తీర్చడమే అధ్యాపకుల ఆశయం అనే ధర్మం వారు పాటిస్తారు. ఎప్పుడన్నా ఎవరన్నా ఒక కొంటె ప్రశ్న వేస్తే ఆయనగారప్పుడు అతి చమత్కా-

రంగా సమాధానం చెప్పి కూర్చోబెడతారు విసుగూ, నసుగూ మాత్రం వుండవు. అసలు ఆయన క్లాసు నిశ్శబ్దంగా వుంటుంది ఆయనలో నిండుతనం వుండటమే దానికి కారణం. చదవడంలో ప్రత్యేకతా, చెప్పడంలో గొప్పతనం కూడా కారణాలు. ఒక్కొక్కప్పుడు రెడ్డిగారు పాఠం చెపుతుంటే ఇతర తరగతుల వారు కూడా వచ్చి కూర్చోవడం జరుగుతూ వుంటుంది. అంత ఆకర్షణ వుంది ఆయనగారి బోధనా సరళిలో..."

ప్రాచీన ఆధునిక రచనలు రెండింటినీ గౌరవ భావంతో చూడగల నేర్పు వుంది రెడ్డిగారిలో. ఒకదాని మక్కువతో రెండవదాన్ని తక్కువ చేయడం జరగదు. 'కాలంవెంటకవి'- అనే సత్యాన్ని గ్రహించిన వారవడంవల్ల అన్నిటికీ ఒకే రీతిగా అవుపోసనం పట్ట కలరు. ఒజ్జగా తాను భాషా సరస్వతిని ఎలా కొలవాలో ఎలా తమ శిష్యులకు ఆ భాగ్యాన్ని అందించాలో రెడ్డిగారికి తెలుసు అందువల్ల ఆదర్శ అధ్యాపకులుగా పేరు సంపాదించారు. అందులో ఆచార్య వర్యులు.

మా ఊరే ఉయ్యాల
బ్రతుకింతా ఊడగా
మా బ్రతుకే జంపాలా
బ్రతుకంతా సాగాలి

## అవ్వకు అంకితం

నారాయణరెడ్డిగారిటీవల ప్రచురించిన గ్రంథాలలో "మా ఊరు మాట్లాడింది" అన్న గ్రంథంలో ఒక ప్రత్యేకతవుంది ఇది కేవలం వారి ఊరుకు మాత్రమే కాకుండా అన్ని పల్లెటూళ్లనూ అక్కడ వాడుకలోవున్న మాండలికాలకూ సంబంధించిన రచన. అయితే తమ ఊరుకు సంబంధించిన గ్రంథంగా దీనికి నామకరణం చేయడంలో కొంత విశిష్ఠత గోచరిస్తుంది.

రచయితలు, తాము జన్మించిన గ్రామమును గురించి చెప్పుకోవడం ఎంతో అవసరం. తల్లి తర్వాత తల్లిలాంటిది తాము జన్మించిన పల్లె. ఆ పల్లెను గురించిన జ్ఞాపకాలను వెలువరించడం, వాటిని కావ్యగానం చేయడం ఎంతో విలువైన విషయం. రెడ్డిగారు ఈ గ్రంథం ద్వారా వారి గ్రామాన్ని స్మరించారు. ఇది నిజానికి గ్రామలక్ష్మికి, అక్కడ వాడుకలోవుండే భాషా సరస్వతికీ ఇచ్చిన నీరాజనమనే చెప్పాలి.

నగరాలలో నాజూకు వాతావరణంలోవున్న ,కవితావైభవంతో మరేదైనపదవుల ఉన్నతిలో వున్నా వారికి కూడా తమ గ్రామాన్ని చూడాలనీ, స్మరించాలనీ వుండటం సహజం. జంటనగరాలలో నేనెరుగున్న రిటైర్డు ఇంజనీయరుగారొకరున్నారు. ఆయన ప్రతి పున్నమికీ తమ పల్లెకు వెళ్ళివస్తూ వుంటారు. ఆ సమయంలో ఇక్కడ ఎంత విలువైన కార్యక్రమమున్నా వదిలి వెళ్లిపోతూ వుంటారు. "ఎందుకండీ ! అలా మాటి మాటికీ మీ ఊరు పరుగులుతీస్తారు శ్రమకాదా" ? అని అడిగాను. ఆయనగారు "అలా అంటారేమిటి ! ఎవరివూరు వారు వెళ్లడం

శ్రమా ! అక్కడ మా అమ్మ వుంది. ముగ్గిన పండు. పంట పొలం వుంది. తాత కట్టించిన భవంతివుంది. గోవులున్నాయి. గోపురంవుంది. చిన్ననాటి స్నేహితులున్నారు - కోతి కొమ్మచ్చులాడిన కొమ్మలున్నాయి. అన్నిటినీ చూచి రావటంలోఎంత పండుగవుంది ? అక్కడ రెండు రోజులుంటే ఆ సంతోషాన్ని నెల రోజులు నెమరువేసుకోవచ్చు" అన్నారు.

"మరి పున్నమి నాడే వెళ్లడందేనికి ? అన్నాను ఆయనలోగల వెన్నెల భావాన్ని తెలుసుకొందామని. ఆయన ముసిముసి నవ్వులు నవ్వి "మావూళ్లో చందమామ బాగుంటుంది. అసలు పల్లెల అందం వెన్నెట్లోనే చూడాలి. ఇక్కడేం వుంది. ట్యూబులైట్ల వెలుగులేగాని" అన్నారు. ఆయన మాట్లాడిన తర్వాత రెండు రోజులు మా ఊరును గురించే ఆలోచించాను.

నారాయణరెడ్డిగారు "మా వూరు మాట్లాడింది" గ్రంథంలో తమ ప్రాంతపు మాండలీకాల్ని వాటిఅంతరార్థాల్ని ఆ మాటల అసలు స్వరూపాల్ని వివరించారు. దానితోపాటు తాము మాండలిక భాషలో వ్రాసిన పాటలు కూడా కొన్నిటిని ప్రచురించారు. అందువల్ల గ్రంథంలో వారి గేయాల సొగసు వయ్యారంగా వొళ్ళు విరుచుకొంది.

మరో విశేషమేమంటే – రెడ్డిగారి ఊరులో పనుల పోశమ్మతో జరిపిన సంభాషణ కొంత పొందుపరచి ఆమె వాడిన పదాలకు అర్థాలు చెప్పారు. ఆ పోశమ్మ కొంత యథార్థం కొంత కల్పనా కలవోసి రూపొందించినపాత్ర అన్నారు రెడ్డిగారు. ఎవరైతేనేం ఆమె రెడ్డిగారితో మాట్లాడింది. ఆయనలో కొంత ఉత్సుకత కల్పించింది. అందుకని యీ గ్రంథాన్ని ఆమెకే అంకితం చేసారు ఇది తమ గ్రామంలో గల ఒక అవ్వమీదగల అభిమానానికి చిహ్నం. అంతేకాదు ఆ గ్రామం మీద వారికిగల గౌరవానికి ప్రతీక. ఇలా ఎందరివ్వగలరు అంకితాలు?

రెడ్డిగారు తమ రచనల్లో తమ గ్రామాన్ని జ్ఞాపకం చేసుకుంటూనే వుంటారు. "మంటలూ మానవుడూ" పుస్తకాన్ని నెల్లూరు వాస్తవ్యులైన శ్రీ ఆల్లారెడ్డి వెంకటకృష్ణారెడ్డికి అంకిత మిస్తూ.

సీదో నెల్లూరి "కోట"
నాదో హనుమాజీపేట

అని వారిరువురి జన్మస్థలాలను జ్ఞాపకం చేసుకున్నారు ఇది గొప్ప విషయం. రచయితలు తమ తమ గ్రామాలకు సంబంధించిన గ్రంథాలు కొన్నింటిని వెలుగు లోకి తేవాలి. వారు పుట్టిన యిళ్లు కళాభవనాలుగా రూపొందే ప్రయత్నం చెయ్యాలి.

తమ గ్రామంమీదగల అభిమానంతోనే కాపోలు రెడ్డిగారు యిటీవల ఇంగ్లాండు వెళ్ళినప్పుడు - అక్కడ ప్రఖ్యాత కవులు జన్మించిన గృహాలు చూచి వచ్చారు. ప్రఖ్యాత కవి "కీట్సు" గృహం చూచారట. అక్కడ ఆయనకు సంబంధించిన వస్తువుల్ని, ఉత్తరాన్ని చూశారట. తరువాత డా. జాన్‌సన్ గృహం దర్శించారట. రాబర్ట్ బ్రౌన్ వసతిగృహం చూశారట. షేక్సుపియర్ భవంతి దర్శించారట. అలాగే వాల్టర్ స్కాట్ బంగళా కూడా చూశారు. ఇంగ్లండులో ప్రఖ్యాత కవులు జన్మించిన, నివసించిన గృహాలు దర్శించిన తర్వాత రెడ్డిగారికి తమ గ్రామం మీదా గృహం మీదా అభిమానం ఎక్కువై వుంటుంది.

మొన్న నాటిన విత్తు
మేటి తరువుగ పెరిగె
కొమ్మ కొమ్మన పూలు
గుబురుగా విరిసె



# "పెరుగుతున్నాడు"

---

చాలా మంది కవిత్వం వ్రాయటం ప్రారంభిస్తారు ఆదిలో కొంచెం మెల్లగా సాగినా తరువాత కవిత ఉప్పొంగటం, కలం పరుగులు తియ్యటం జరుగుతూ వుంటుంది. కొంత కాలం పోయినతర్వాత ఆ కవి నుద్దేశించి "పైకివస్తున్నాడు" అని చెప్పుకుంటారు. కవుల జాబితాలో వేస్తారు. ప్రచురణలు ప్రారంభమౌతాయి. పత్రికల వారి వద్దనుంచి వ్యాసాలు పంపమని ఉత్తరాలు వస్తాయి. సభలకు ఆహ్వానిస్తారు. సన్మానాలు చేస్తారు. క్రమంగా ఆ కవి పైకి వస్తాడు. కవితలో వికాసం తొంగిచూస్తుంది.

కొందరు అలా వ్రాస్తూ వ్రాస్తూ ఎక్కడో ఒకచోట నెత్తిన మొట్టినట్లుగా ఆగిపోతూ వుంటారు. కలం నడవదు. గతాన్ని నెమరు వేసుకుంటూ కాలం గడుపు తారు. కొందరు ఆదిలోనే విజృంభించి కవిత్వం వ్రాస్తారు. చాలాపైకి ఒక్క సారే వచ్చినట్లు కన్పిస్తారు. కాని హటాత్తుగా ఆగిపోతారు. కొందరు మంచి గ్రంథం వ్రాయాలని ఆలోచిస్తానంటూనే జీవితం గడిపేస్తారు. వీరు తమ కడుపులో ఉన్న కవనాన్ని బయటపెట్టడానికి సుమూహూర్తం దొరక్క శూన్యంలోకి నడిచి పోతారు.

ఏ కొద్ది మందికో మాత్రమే దినదినాభివృద్ధిగా కవిత్వం వ్రాయగల శక్తి లభిస్తుంది. ఒక కావ్యం కంటె మరొక కావ్యం గొప్పదిగా వెలుగొందుతూ వస్తుంది ఈ కవులకు విశ్రాంతిలేదు. వారి కలాలకు విరామంలేదు. బ్రతుకంతా సాహిత్య వ్యవసాయమే జీవితమంతా వారు కృషీవలులే. ఇలాటి వారే శతాధిక గ్రంథకర్త లవుతారు. తమ కవనాల తోటను పెంచుకుంటూ పోతారు. దానితో పాటు వారి

హృదయమూ పెరుగుతుంది. వారు మహాకవుల క్రింద చలామణీ అవుతారు. శతాధిక గ్రంథ కర్తలవుతారు. వారితో తృష్ణ చల్లారదు. ఇంకా ఇంకా పంటలు పండించాలనే ప్రయత్నిస్తూ వుంటారు. ఇలాంటి వారినే ఎనభై ఏళ్ళ కలం, తొంభై ఏళ్ళ కలం వంద ఏళ్ళ కలం-అంటూ వుంటారు. ఇది కవి జీవితానికి అంచులవరకూ పెరిగిన జలదారు. కొద్దిమంది మాత్రమే యీ జలతారు తలపాగ ధరించగలుగుతారు.

సుమారు పదేండ్ల క్రిందటి మాట. జస్టిస్ ఆవుల సాంబశివరావుగారు నారాయణరెడ్డిగారిని గురించి వ్రాస్తూ "రెడ్డిగారు పెరుగుతున్నారు వారి భావన లోతును సంతరించుకొంటున్నది. వైశాల్యతను పెంచుకుంటున్నది. అది విశ్వానికి విస్తరించగలగడంలో మానవుని ఉన్నతుణ్ణి చేసే విశ్వప్రయత్నంలో ప్రముఖ పాత్ర వహించగలదని విశ్వసిస్తాను" అన్నారు.

అప్పటికీ యిప్పటికీ సాంబశివరావుగారు ఆశించినట్లుగా రెడ్డిగారు పెరుగుతున్నారు. భావనలో చాల విశ్వజనీనత గోచరిస్తుంది. కవిత ఉన్నత శిఖరాలను తాక పోతున్నది ఇంకా వారు చాలా కవితలు అల్లగలరని అవి వారి స్థాయిని యింకా పెంచగలవని ఆశిస్తున్నాము వారిది "నూరేళ్ళ కలం" కావాలని అభిలషిస్తున్నాం

ఎవరు వేశారిచట 
ఈ క్రొత్త బాటా
ఎవరు పాడారిచట
ఈ క్రొత్త పాటా ?

## 'ఇతని మెచ్చులు...'

"కాలం వెంట కవి" అనే సత్యము ఒకటి వున్నది మనకు. కాలం సుళ్లతో పరవళ్ళతో ముందుకు సాగిపోతూ వుంటుంది. పాతను విడిచి ముందుకు తూగుతూ వుంటుంది. అలాంటి సమయంలో కలాలు యుగధర్మాన్నీ, లక్షణాన్ని ఆపగతం చేసుకుని వాటిని హృదయంగమంగా చిత్రించి ప్రజలకందించటం కవిధర్మం. యుగాల వెనుకకు పోయి ఆనాటి ధర్మాలను చర్విత చర్వణంగా చిత్రించటం అంతగా కవిని ఆకర్షించదు. తన యెదుట కనిపించే దృశ్యాలు, వినిపించేవార్తలు ఆతని కలాన్ని వచ్చి చుట్టుకుంటాయి. కవి ఆ కలాన్ని విదిలించి వెలుగు దారాలు అల్లుకుంటాడు. ఆ దారాల అల్లికలో వర్తమాన భావనలన్నీ వలలోపడ్డ చేపలుగా చిక్కు కుంటాయి. కవి తాజా కవితల వ్యాపారిగా మారిపోతాడు.

యుగధర్మం కూడ చరిత్రలో ఒక భాగం. అనంతంగా సాగిపోయే కాలంలో ఎక్కడా చరిత్ర ఆగిపోదు. అలా చరిత్రను సాగిపోయే స్థితిలో వుంచే బాధ్యత కవిమీద చాల వుంటుంది. ప్రతి చరిత్రలో ఆనాటి ఛాయలు దాగి వుంటాయి. అవి చరిత్రను తమలో దాచుకుంటాయి. ఒకప్పుడు అవే చరిత్ర కాధారం కూడ అవుతాయి.

కవిని యుగకర్త అంటారు. ఆ యుగంలో గల ధర్మాలను పాటించి వాటికి తగిన ప్రగతిని ప్రబోధించి మానవజాతిని ఆ పథంలో నడిపించే మహానాయకుడు కవి. యుగాన్ని అతను గౌరవిస్తాడు. యుగ మాతన్ని ఆశీర్వదిస్తుంది. కనుక ఏనాటికానాడు సంఘంలో ప్రతిబింబించే రూపాలను చిత్రించటం, తలయెత్తే సమస్య

లను పరిష్కరించటం ఆ కాలానికి తన కవితలు ప్రతీకగా నిలవటం కవి సాధించ వలసిన విజయాలు.

నారాయణరెడ్డిగారు ఇలా తన కవితలో యుగధర్మాన్ని మిక్కిలిగా పోషించారు.

ఇతడు యుగలక్షణంబుల నెరిగి కరగి
కృతులు నిర్మించి కోవిద స్తుతులు వడయు
.............................................
ఇతని మెచ్చుట తెలుగు భారతిని మెచ్చు
టని తలంతురు సత్య ధర్మాభిరతులు

అని తెలుగు లెంక శ్రీ తుమ్మల సీతారామ మూర్తిగారు రెడ్డిగారిని ప్రశంసించారు. నిజంగా యుగధర్మాన్ని పాటించి ఒక వృద్ధ మహాకవి నుండి ప్రశంస లందుకోటం రెడ్డిగారి అదృష్టం. నవ్యతకు – భవ్యతకు కాణాచి నారాయణరెడ్డి – అనటంలో ఆశ్చర్యం లేదు.

ఎవరు ఎగురవేశా
రన్నిన్ని జెండాలు
జెండాలు కావుకావవి
కవనాల హుండీలు



# వెన్నెల జెండాలు

---

కవుల కృషిని వెలువరించి వెలుగులోకి తెచ్చి కొన్ని మజిలీలు ఏర్పరచి అక్కడ వెన్నెల జెండాలు ఎగురవేస్తాయి- ఆ కవి వ్రాసి అచ్చువేసిన గ్రంథాలు. అచ్చుపడని కవితలు ఎవరైనా కోరితే మచ్చు చూపించదానికేగాని పదిమందిలోకి రావడానికి పనికిరావు పత్రికలు వగైరాలలో ప్రచురించే వ్యాసాల, గేయాలు "పరిగ పంటలు" గా నిలిచిపోతాయి అందువలన కవి ప్రతిభ గ్రంథ ప్రచురణల్లో దాగి ఉంటుంది. "ఫలనా కవి" వ్రాసిన "ఫలానా గ్రంథం" అనేమాట మంచికైనా చెడ్డకైనా ప్రచారంలోకి వస్తుంది. కవి ప్రతిభను ప్రాముఖ్యాన్ని గ్రంథాలలోనే గుర్తించడం గూడా జరుగుతుంది. అందువలన కవికి రచనకంటే ప్రచురణ ముఖ్యమైనది. ఆవిష్కరణ నిజంగా ఆనందహేతువు అవుతోంది. అదృష్టాన్ని బట్టి అవకాశాన్ని బట్టి ఒక కవి గ్రంథాలు వెలుగులోకి వస్తున్నాయి.

శ్రీ రెడ్డిగారు చాలా గ్రంథాలను వెలుగులోకి తేగలిగాడు. వారి గ్రంథాలను అచ్చువేయటానికి చాలామంది ముందుకు వస్తున్నారు. ఆయన గ్రంథాన్ని అచ్చువేయటంలో ముచ్చటపడటం, సాహితీ గౌరవాన్ని పంచుకోవటం ఒక పండుగగా భావించే మిత్రులు గూడా వారికి ఉన్నారు. శ్రీ రెడ్డిగారు ప్రతి సంవత్సరమూ ఒక పుస్తకం వ్రాయాలని నిర్ణయించుకోవడం ముదావహం. వారికిప్పుడు 50 సంవత్సరాలు. నలుబది గ్రంథాలు వెలువడినాయి. "వయస్సుతోపాటు సమానమైన గ్రంథ సంఖ్య షష్టిపూర్తి నాటికి సహకూర్చగలరు" అనటంలో సందేహంలేదు.

"నవ్వని పూవు" లో భావన నవనవోన్మేషణగా పరిఢవిల్లి 'విశ్వంభర' వరకూ విజయవంతంగా కొనసాగింది. ఈ గ్రంథాలలో అనేక తరగతులున్నాయి.

మాత్రా ఛందస్సులో కొన్ని, ముక్త ఛందస్సులో కొన్ని, వచన కవిత్వంలో కొన్ని, రేడియో నాటికలు కొన్ని, కొద్దిగా వ్యాస సంపుటులు, నవ్యాంధ్ర కవిత్వం మీద పరిశోధనా గ్రంథం ఒకటి, "శిఖరాలు-లోయలు", ముత్యాల కోకిల, మీరా బాయి వంటి అనువాదాలు ఉన్నాయి.

వీటిలో "ఋతు చక్రము" నకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి లభించింది. 'మంటలూ-మానవుడూ' గ్రంథానికి కేంద్రఅకాడమీ బహుమతి లభించింది క్రొత్తగా వెలువడిన "విశ్వంభర" ఏదో గొప్ప బహుమతి పొందే కావ్యంగా సాక్షాత్కరించింది. తక్కిన గ్రంథాలలో తలమానికం "కర్పూర వసంత రాయలు". ఈ గ్రంథం శ్రీ రెడ్డిగారికి నిజంగా కర్పూర నీరాజనం అందించింది పాఠకలోకంలో నిత్యవసంతంగా నిలచి ఉన్నది. ఇక్కడ ఒక్కమాట చెప్పవలెను ఇటీవలనే శ్రీ రెడ్డిగారు ఉత్తర అమెరికాలో పర్యటించినపుడు. "నాషెవెల్ టెన్నిస్" నగరంలో "కర్పూర వసంతరాయలు" కావ్యగానం L. P Records లోకి ఎక్కించబడినది ఈ నగరాన్ని "సంగీత్ నగర్" అంటారట. ఇక్కడ జానపద సంగీతానికి ప్రాముఖ్యత ఎక్కువట శ్రీ ఎ. వి. రామయ్య మిత్రుల ప్రోత్సాహంతో ఈ కార్యక్రమం ఏర్పాటు అయ్యింది. శ్రీ రెడ్డిగారే కావ్యగానం చేసారు. W S M స్టూడియో (టి. వి. & రేడియో) వారు రికార్డు చేసారు. వెయ్యి రికార్డులు త్వరలో వెలువడనున్నాయి ఒక తెలుగు కవి దూరదేశాలలో గొంతెత్తి కావ్యగానం చేయడం, అది రికార్డు రూపంలో వెలువడటం ఇదే మొదలు. అక్కడగల తెలుగువారందరూ శ్రీ రెడ్డిగారి కవనాలు విని తన్మయులు అయినారట. వారందరూ ఈ రికార్డుకోసం ఎదురుచూస్తున్నారనటంలో ఆశ్చర్యంలేదు.

వారి రచనలనన్నింటినీ సమీక్షించటం ఈ గ్రంథంలో సాధ్యం కానిపని వీటిని పేర్కొనటం మాత్రమే నా ఉద్దేశ్యం. ఈ గ్రంథాలలో మీరాబాయి పదావళికి అనువాదాలున్నాయి. ఇవి భక్తి రసపూరితమైన గేయాలు. నృత్యఖేలనకు అనువైనది మొదటి ప్రపంచ మహాసభల సందర్భంగా "తరతరాల తెలుగు వెలుగు" అనే నృత్యగేయ రూపకం వ్రాసారు. ఆ సభలలో ప్రదర్శింప చేసారు. మందార మకరందాలు పోతన భాగవతము నుండి ఏరుకొన్న కొన్ని మణులు. వీటిపైన శ్రీ రెడ్డిగారు అద్భుతమైన వ్యాఖ్య చేసారు. ఎంతో విలువైన గ్రంథం. "ఇంటింటా భాగవతం" అన్న భావనకు ఈ గ్రంథం ఎంతో తోడ్పడినది. "పగలే వెన్నెల"

శ్రీ రెడ్డిగారు వ్రాసిన సినిమా పాటల సంకలనం. సుమారు ఇరువది ఏండ్లుగా శ్రీ రెడ్డిగారి కలం చిత్రించిన రెండు వందల పైచిలుకు పాటలు ఇందులో పొందు పఱచబడిఉన్నాయి. సినిమా అభిమానులకు ఇది పారాయణగ్రంథం అయినది. ఈ పాటలలో గూడా శ్రీ రెడ్డిగారి భావనా పటిమ, పాండిత్య గరిమ, సంగీత అభి నివేశం నిండుగా మెండుగా మేళవించినాయి.

ఏ గ్రంథం చదివినా ఒక కవి తన హృదయాన్ని విప్పుకొని, తన అవేద ననూ, ఆవేశాన్ని, బోధననూ, సాధననూ, హొయలు, లయలు, ఎలా వెలార్చింది తెలుస్తుంది. ఈ కలానికి ఒక ప్రత్యేకత ఉంది అని నిరూపిస్తుంది. తన కోసం గాదు, తన పాఠకుల కోసం–ఇంకా చెప్పాలంటే తన ప్రజలకోసం వ్రాస్తున్నా నని–ఆయన వెనుక నుంచి చిఱునవ్వులతో చెప్పుచున్నట్లుంటుంది.

బ్రతుకు బాట వెంట ఏటేటా ఒక వెన్నెల బావుటాను ప్రతిష్ఠించుకుంటూ ముందుకు సాగిపోతున్న బాటసారి ఈయన. చూడండి ఆ బావుటాలన్నీ విసీలా కాశంలో ఎలా ఎగురుతున్నాయో? వాటి విసురు నుండి కవనాల పవనాలు ఎలా వీస్తున్నాయో ! – విస్తరిస్తున్నాయో!

# నారాయణరెడ్డిగారి రచనలు

1. నవ్వని పువ్వు
2. విశ్వగీతి
3. స్వప్నభంగం
4. నాగార్జున సాగరం
5. కర్పూరవసంతరాయలు
6. విశ్వనాథనాయడు
7. సమదర్శనం
8. అక్షరాల గవాక్షాలు
9. మధ్యతరగతి మందహాసం
10. వ్యాసవాహిని
11. మరో హరివిల్లు
12 ముఖాముఖి
13 ఉదయం నా హృదయం
14 జలపాతం
15. అజంతా సుందరి
16. నారాయణరెడ్డి గేయాలు
17. వెన్నెలవాడ
18 రామప్ప
19. దివ్వెల మువ్వలు
20. ఋతుచక్రం
21. జాతిరత్నం
22. గాంధీయం
23 ఆధునికాంధ్ర కవిత్వం
24. మంటలు-మానవుడు
25. మందార మకరందాలు
26. శిఖరాలు-లోయలు
27. మనిషి, చిలక
28. మార్పు నా తీర్పు
29. మీరాబాయి
30. తేజస్సు నా తపస్సు
31. తరతరాల తెలుగువెలుగు
32 పగలే వెన్నెల
33 ఇంటిపేరు చైతన్యం
34. భూమిక
35. మధనం
36. ముత్యాలకోకిల
37. మృత్యువునించి
38. మా ఊరు మాట్లాడింది
39. విశ్వంభర
40. సమీక్షణం

ఎవరిదెవరెవరిదా
పగడాల ఇల్లు ?
ఇల్లుకాదది తాతయ్య
కవనాల పొదరిల్లు.

# "నవ్వుల పొదరిల్లు"

---

రెడ్డిగారి కుటుంబం తెలంగాణాలో వాసికెక్కినది. ధర్మం, దానం, త్యాగం తెలిసిన రైతు కుటుంబం. తల్లిగారు శ్రీమతి ఒచ్చమ్మగారు. తండ్రి మల్లారెడ్డిగారు. వారికి ఏకైక పుత్రుడు నారాయణరెడ్డిగారు. వ్యవసాయంలో జొరబడకుండా ఒడికి వెళ్లి విద్యా వ్యాసంగంలో పడ్డారు. చదువుల తల్లి దీవించింది. పెద్ద చదువులకు బస్తీ జేరి అక్కడ చదువుముగించుకొని పట్టణంజేరి పండితులై అఖండ కీర్తి గడించారు. వారి వూరైన హనుమాజీపేటకు పేరు కీర్తులు సంపాదించి పెట్టారు నారాయణరెడ్డిగారి భార్య శ్రీమతి సుశీలగారు

వీరికి నలుగురు ఆడపిల్లలు- గంగ, జమున, సరస్వతి, కృష్ణవేణిగార్లు. అల్లారు ముద్దుగా పెరిగారు. ఒక కవి చంద్రుడు తండ్రి కావడం వారినెంతో ఉల్లాసపరచింది. మంచి నేర్పరులైనారు. వినయ విధేయతలు గల వారైనారు. విదుషీమణులైనారు. పెద్ద కుమార్తెకు వివాహమైంది. భర్త శ్రీ భాస్కరరెడ్డిగారు, ఇంజనీరు. వీరికి మనస్విని అనే కుమార్తె, చైతన్యదేవ్ అనే కుమారుడు ఉద్భవించారు. రెడ్డిగారు తాతగారై ఈ పసిడి బొంగరాలతో ఆడుతూ పాడుతూ వుంటారు. అవి గుండెలలో గిరగిర తిరుగుతూవుంటాయి. కవిని తాతచేసిన ఆ యిద్దరు పిల్లలు తల్లిదండ్రుల మనస్సుల్లో మల్లెపందిరిగా విరిసారు. అమ్మమ్మ కంటిలో ఆరనిజ్యోతులుగా మెరుస్తున్నారు. శ్రీమంతుడైన రెడ్డిగారి గృహంలో ఎప్పుడూ చిరునవ్వులు కురుస్తూవుంటాయి. వారి ఆతిధ్యం చల్లటి నీడ కల్పిస్తూ వుంటుంది. వారి హృదయాలలోగల ఆత్మీయత అతిధులను చూడగానే వారి గుమ్మాలలో పూలుపరుస్తూ వుంటుంది.

కపులకు పిల్లలంటే మోజు. అలా వారితో ఆడుకోటంవల్ల ఉభయ సంధ్యలు మేళవించినట్లుంటుంది. రెడ్డిగారు అమెరికా వెళ్లినప్పుడు అక్కడి పిల్లలతో ఆడుతూ పాడుతూ ఒకటి రెండు బాలగేయాలు రాసారట. ఇంటిదగ్గర మనుమడు, మనుమరాలు వారిచేత ఇంకా అలాటి పాటలు వ్రాయించి బాలవాఙ్మయంలోకూడ ప్రవేశించే అవకాశం కల్పిస్తారని ఆశించవచ్చు.

ఎదను గ్రుచ్చిన చూపు
లెంత అందమ్ము
అవునవును, విడలేని
ఆత్మ బంధమ్ము



# అక్కడున్నారు మనవాళ్లు

---

తెలుగుజాతిని గూర్చి ఆలోచిస్తున్నప్పుడూ "అక్కడున్నారు మనవాళ్ళు" అని ఇతర రాష్ట్రాల పేర్లు, ఇతర దేశాలపేర్లు చెప్పుకోవటం పరిపాటి. ఆయా ఇతర ప్రాంతాలలో నున్న తెలుగువారు – "అక్కడుంది మనదేశం" అని ఒకప్పుడు గర్వంగా, ఒక్కొక్కప్పుడు నిట్టూర్పుతో చెప్పుకోవడం జరుగుతుంది. వారందరూ ఎప్పుడో ఆయా ప్రాంతాలకు వలస పోయినవారు. ఇటీవల వివిధ దేశాల మధ్య అనుబంధాలు, సంబంధాలు ఎక్కువ కావటం వలన ఉద్యోగాపేక్షలు వెంటపడి తరమటం వలన, చాలామంది దూర ప్రాంతాలకు వెళ్ళడం జరుగుతోంది. అయితే వారు స్థిరపడి సిరిసంపదలతో తులతూగినా, తమ తెలుగుతనాన్ని, వెలుగు తనాన్ని కాపాడు కోవటానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. అది పరాయి దేశం అవటం వలన, పరభాషలో మునిగి తేలటం వలన, అక్కడ గల తెలుగువారి సంతతికి భాష అందటం లేదు, తగినంత అభివృద్ధి చెందటంలేదు.

ఇలాటి సందర్భాలలో ప్రపంచ తెలుగు మహాసభ ఏర్పడి, ఇతర ప్రాంతాలలో, ఇతర దేశాలలో వారికి బోధనా సౌకర్యాలు కల్పించటం కోసం సాంస్కృతిక సంపదను అందించటంకోసం కృషి చేస్తోంది. అలాటి ప్రాంతాలకు సాంస్కృతిక రాయబారాలుగా కవులను, గాయకులను, నటులనూ పంపుతోంది. మలేషియాకు మొదటి సారిగా పంపిన వారిలో శ్రీ నారాయణరెడ్డి, దాశరధి ప్రభృతులున్నారు. వీరు ఆంధ్రులున్న ప్రాంతాలలో పర్యటించి, ఉపన్యసించి వారిని చైతన్య వంతులను చేసారు. రెండవ ప్రపంచ తెలుగుమహాసభల సందర్భంలో గూడా శ్రీ నారాయణరెడ్డి మలేషియా వెళ్ళడం జరిగింది. వెనుకటి పరిచయాన్ని బల

పఁబుమకొన్నారు అక్కడ తెలుగువారి స్థితి గతులను తెలుసుకొన్నారు. తెలుగు తనాన్ని గురించి ఉద్బోధించి వారిని మెప్పించారు. ఇది ఈ సంవత్సరమే జరిగినది ఈ సంవత్సరమే వీరు "ఉత్తర అమెరికా తెలుగు సమాఖ్య'' పక్షాన వారితృతీయ వార్షికోత్సవములో పాల్గొనటానికి వెళ్ళారు. ఈ ప్రతినిధి వర్గంలో మరికొంతమంది ఆంధ్రులు కూడా ఉన్నారు. శ్రీ నారాయణరెడ్డి, శ్రీశ్రీ గారలకు ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పరచ బడినాయి. వీరు చాలా పట్టణాలు దర్శించి ఉపన్యసించి వచ్చినారు. శ్రీ నారాయణరెడ్డిగారు ఆ దేశాన్ని గూర్చి చెపుతూ "వైజ్ఞానికంగా ఎంతో అభివృద్ధి చెందిన దేశం. అదంతా నాకొక స్వప్నంగా కనబడుతోంది చూపుల సెల్యులాయిడ్ మీద చిత్రించుకొన్న స్వర్ణ స్వప్నం. అక్కడ నేను కవిని అనే మాట మరిచి పోయాను. లేమికి లేమి గల దేశమది" అన్నారు. తెలుగు వారందరూ శ్రీ రెడ్డిగారి పవనాలు విని గర్వించారు. వారి నింటింటికి ఆహ్వా నించారు. ప్రతి వారికీ తెలుగు సంస్కృతిని మూట గట్టుకొని వచ్చి తమ నట్టింట గుమ్మరించినంత ఆనందం గలిగినది. ప్రతిఇల్లు ఒక పండుగ కాని పండుగ చేసి కొన్నట్లు అయినది

దిశాంతాలలో తెలుగు గొంతులు విన్పించటం తెలుగు సంస్కృతిని పంట పండించటం, తెలుగు తల్లి పేరు చెప్పి గంటలు మ్రోగించటం-గొప్ప మహోత్సవము. వాటిలో పాల్గొన్న అదృష్టం శ్రీ రెడ్డిగారికి లభించినది.

ఎటనుండి ఆ వెలుగు
ఎటనుండి వచ్చె
కవిరాజు కనుకొనల
కలువల్లు విచ్చె

# పదవులు - హోదాలు

చాలాకాలంనుంచీ కవిగా నారాయణరెడ్డిగారి పేరు ప్రసిద్ధికెక్కినది. ఆంధ్ర దేశమంతా ప్రాకింది. కవితలు, గానాలు విని అంతా మురిసిపోయారు. ఒక సారస్వత లోకానికేగాదు, ఇతర పెద్దలకూ ఆయనంటే ఎంతో అభిమానమేర్పడింది. ఒకసారి అప్పటి శాసనమండలి అధ్యక్షులైన శ్రీ మాడపాటి హనుమంతరావుగారి వద్దకు వెళ్ళి 'ఈవేళ శ్రీ నారాయణరెడ్డిగారికి సన్మానం. మీరు అధ్యక్షత వహించాలి' అన్నాను. "ఆఁ నారాయణరెడ్డికా ? అయితే తప్పక వస్తాను" అని చెప్పారు. అంతకు ముందు ఎవరో వెళ్ళి ఆరోజింకో సభకు ఆహ్వానిస్తే "రాలేను" అన్నారట. అంటే దీనిని బట్టి శ్రీ రెడ్డిగారిపై వారికున్న అభిమానం తెలుస్తోంది. వెనుక ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ఒకసారి శ్రీ రెడ్డిగారిని పిలచి తమ ఇంట్లో సభచేసి శ్రీ రెడ్డిగారి చేత కావ్యగానం చేయించారట. మంత్రులలో చాలామందికి రెడ్డిగారు అంటే ఎంతో అభిమానం. ఆయన్ని చూడాలని, కవిత్వం వినాలనీ కుతూహలపడుతూ ఉంటారు. వారికి అన్ని వర్గాలలో సమున్నతమైన గౌరవముంది – అభిమానులున్నారు. వీరికి పదవులు లభించటంలో ఆశ్చర్యంలేదు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులు, అంతర్జాతీయ తెలుగు సంస్థలో బోర్డు ఆఫ్ గవర్నర్స్‌లో ఒకరు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీలో కార్యనిర్వాహక సభ్యులు. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు "బోర్డు ఆఫ్ స్టడీస్" అధ్యక్షులు. "స్రవంతి", "నాట్యకళ", "తెలుగువాణి". పత్రికల సంపాదక వర్గ సభ్యులలో ఒకరు. న్యూఢిల్లీలో ఆకాశవాణి ఏర్పాటుచేసిన జాతీయ కవి

సమ్మేళన సదస్సులో పాల్గొన్నారు. తెలుగులో అనేక పత్రికలలో వ్యాసాలు ప్రచురించారు అనేక సాహిత్యోత్సవాలలో పాల్గొని వ్యాఖ్యాతగా ఎనలేని కీర్తి గడించారు ఎన్నో సాంస్కృతికసంస్థలకు అధ్యక్షులు, సలహాదారులుగానున్నారు. వీరి ఆధ్వర్యంలో చాలామంది డాక్టరేటులు చేసారు. గర్వింపదగిన కవిగా, గణనీయమైన వ్యక్తిగా పరిగణింపబడుచున్న శ్రీ నారాయణరెడ్డిగారికి కోరితే ఎన్నో పదవులు. పలుకుబడికేమి కొఱత ?

నగము పుట్టినదెపుడు ?
నరుడుపుట్టినదెపుడు !
బండలుబికినయపుడె
గుండెలూగినయపుడె !

# పౌరాతన్యం, పౌష్కల్యం "విశ్వంభర" లో

మానవ సమాజంపైన, మానవత్వంపైన అభిమానంతో, అనురాగంతో పరుగులు తీసిందింత కాలం - రెడ్డిగారి కలం. మానవుని ఉత్తమ స్థితికీ, గతికీ మార్గాలు అన్వేషించింది. ఫలితాలు ఆశించింది. ప్రగతిపథంలో మానవుడు - పండు వెన్నెలలో పాటలు పాడుకొంటూ విజయ గర్వంతో ముందడుగు వేయాలని ఆకాంక్షించింది. దీనికి అనువైన బోధనలు, సాధనలు సమకూర్చగల కవితలు చిలకరించింది. వాటిలో ప్రతి పంక్తి మానవుణ్ణి పలకరిస్తున్నట్లు భావించి, ఆనందించింది.

ఈ అన్నిటినీ అతిక్రమించి, మానవునికి సంక్రమించిన పురాతన భావనలలో సత్యాన్ని, దాన్ని చుట్టుకొనివున్న కవిత్వాన్నీ వెలువరించాలనే కోరిక కలిగింది రెడ్డిగారి కలానికి.

ఆ ఉత్సాహంలో, ఆ ఉద్వేగంలో తన వెంట పరుగులు తీస్తూ సృష్టికి మూలం ఎక్కడో తెలుసుకొని అక్కడ ఆగింది. చాలినంత వస్తువు దొరికిందని అప్పుడు సంతృప్తి చెందింది. సమస్త చరా చర వస్తుకోటి తన ముందు సాక్షాత్కరించడం, తమ చరిత్ర వ్రాయమని ప్రోత్సహించడం ఆలకించిందా కలం.

అది అనంత చరిత్ర... అద్భుత చరిత్ర. వస్తువు పౌరాతన్యం, కవిత పౌష్కల్యం- ఇవీ ఈ విశ్వంభరలో అడుగడుగునా తొంగిచూచే రాగమాలికలు- రజితడోలికలు. విశ్వస్వరూపాన్ని చిత్రించడంకోసం రెడ్డిగారు - ఎన్నో రహస్యా

లను పరిశోధించారు. ఎన్నో సత్యాలను సాధించారు. వాటిని నిత్యనూతనంగా మార్చి తమ కవిత్వ పటుత్వ సంపదతో పాఠకులకు బోధించారు.. ఇది గొప్ప కావ్యం కావడానికివి కారణాలు

కవి మనస్సు ఆగలేదు - విశ్వంభర చరిత్రను తెలుసుకోవడం కోసం, సృష్ట్యాదిలోకి పరుగులు తీసేవరకు. అక్కడ గల అచరాలను ఓర్పించేవరకు. అక్కడ గల చరాలను చూచేవరకు- అంతేకాదు- ఆదిమానవులను పలకరించేవరకూ. అక్కడితో ఎదపొంగింది. కలం రంగురంగుల కుంచెగా మారింది ప్రకృతిలోని గిరులు, తరులు, నదులూ, నదాలు, అంబుధి, ఆకాశం- ఇవన్నీ వచ్చి ఆయన కళ్లముందు ప్రత్యక్షమైనాయి. పేరులేని నరునితో చరిత్ర ప్రారంభమైంది. పేరున్న మానవుని వరకు కొనసాగింది.

కాలం మారుతూవచ్చింది. మార్పులన్నిటినీ కవితలో మలచుకున్నారు. అంతకు ముందు తామెరగని వస్తు సముదాయాన్ని క్రొత్త క్రొత్త పేరులతో పిలుచుకున్నారు. తమ కవిత్వంలో వాటిలోని సొగసులూ, శక్తులూ గెలుచుకున్నారు. ఈ కవిత అంతా ఒక అనుపమ దృశ్యం... కరిగిపోని స్వప్నం... చెరిగిపోని చిత్రపటం...

విశ్వంభరలో రెడ్డిగారు వెలిబుచ్చిన రహస్యాలను, మేల్కొల్పిన శక్తులను, ఆరాధించిన అపూర్వ భావనలను...అన్నిటినీ మించి ఆయన కవితలో చూపిన సొగసులను వర్ణించడం అలవికాని పని. ఈ కొద్ది పరిధికి అందని పని.

మనిషి పుట్టాడు - పెరుగుతున్నాడు. ప్రకృతి అదివరకే వర్ధిల్లింది. మానవుడు తన జీవనంకోసం, తన సుఖంకోసం. సంతోషంకోసం, సిరికోసం, విద్విలాసంకోసం, ఆత్మానందంకోసం, పరమాత్మ స్వరూప దర్శనంకోసం- ఈ అన్నిటికోసం ప్రకృతిని ఆశ్రయించాడు. ప్రకృతి మహాదాత అన్నిటినీ అందించింది. ఆశీర్వదించింది. మానవుడు పెరిగాడు - ఘనుణ్ణనుకొన్నాడు. నాగరికుణ్ణను కొన్నాడు. శాస్త్రజ్ఞుణ్ణనుకొన్నాడు. సర్వజ్ఞుణ్ణనుకొన్నాడు. ప్రకృతినే జయించ

డానికి పూనుకొన్నాడు. అయినా ప్రకృతి తన స్వభావాన్నీ, ప్రభావాన్నీ మార్చు కోలేదు. ఈ పరిణామమే విశ్వచరిత్ర.

నారాయణ రెడ్డిగారీ చరిత్రను ఎంతో కవితావేశంతో వ్రాశారు. కళా నైపుణ్యంతో కలాన్ని నడిపారు. పాఠకులనెన్నో క్రొత్త భావనలు అందించారు. మనిషి, మాటా, అడుగు, నడకా, ఆశలూ, ఆశయాలూ, - సభ్యత- నాగరికతా - వీటి పరిణామాలన్నిటినీ ఈ విశ్వంభరలో చక్కగ చిత్రించి ఉత్తమ రచనగా రూపొందించారు. అందుకుగాను వారిని అభినందిస్తున్నాను.

అయితే ఈ గ్రంథం - ఏ విజ్ఞానపీఠం వైపో చూస్తోంది.

ఎక్కడిది ఆ వెలుగు
ఎక్కడిది ఆ జిలుగు
తెలుగు జిలుగుల పడవ
వెన్నెలా తెరచాప

## "వెన్నెల తెరచాప"

---

సాహిత్యం ఒక మహా ప్రవాహం ! ఎంత కాలంనుంచో, ఎదురులేని, కొదువ లేని, బెదురులేని శక్తితో ప్రవహిస్తుంది జాతిని పునీతం చేస్తుంది. మానవునిలో మధుర భావనలు కల్పిస్తుంది. ఉదయాలను పలకరిస్తుంది. హృదయాలను గిలక్కొ స్తుంది. సంధ్యారాగాలతో సరాగాలాడుతోంది. సమాజంతో సంభాషణలు జరుపు తోంది సాహిత్య ప్రయోజనాలెన్నెన్నో ! వాటిని వెల్లడించడంకోసం కవులు ఎన్నెన్నో కవితలు వ్రాసారు. ఎన్నెన్నో పల్లవులు సమకూర్చుకొని, పాటలు కూరుస్తాడు ఒకొక్కప్పుడు దారితప్పిన మానవుణ్ణి – సన్మార్గానికి మళ్ళి స్తారు. అందువల్లనె కవులు ఆరాధనులయ్యారు నా దృష్టిలో కవులందరూ సాహిత్య వాహినిలో వెన్నెల డింగీలు వేసుకొని పయనిస్తున్నట్లు తోస్తుంది. పైన రంగు రంగుల ఆకాశం .. ప్రక్కన ఆమనులు, యామినులు, – ఆరామాలు ఆలయాలు – గగనంలో మౌనం, గాలిలో గానం, – వీటి నన్నిటిని తిలకిస్తూ, పులకిస్తూ తన డింగీని తను హాయిగా నడుపుకొనిపోతూ వుంటాడు కవి. అతని కతడే సరంగు... అతడే చుక్కానిదారుడు. అతనికతడే వంటరి ప్రయాణీకుడు. ఒకప్పుడు తెరచాప నెగురవేసి, తేలికగా పసువులుతీసే పడవలో పాడుకొంటూ వుంటాడు – పాటగా మారిపోతూ వుంటాడు. ఆ తెరచాప నీల ఆకాశం నీడలో, కొంతతడవు వెన్నెల చాందినీ క్రింద, కొంత సేపు పయనిస్తూ వుంటుంది. ఈ డింగీకి లంగరు లేదు. రేవులేదు . ఆగని ప్రయాణం...అలసిపోని ప్రయాణం.

ఈదృష్టితో పరిశీలించినపుడు– నాకు వెన్నెల తెరచాపలా కనిపిస్తాడు. ఈ శీర్షికతో ఎన్నో గ్రంథాలు వ్రాయాలనిపించింది. ఇంతలో రెడ్డిగారి మీద పుస్తకం వ్రాయమనే పిలుపు వచ్చింది. ముసలితనం ముందు సంగతుల్ని వొప్పుకోదు. అందుకని ఈ గ్రంథానికి వెన్నెల తెరచాప– డా. నారాయణరెడ్డి అని నామకరణం చేశాను.

రెడ్డిగారు నిజానికి అలాటి వారే ! ఆయన జీవితమంతా వెన్నెల మయమే ! కీర్తి కూడా అంతే ! అసలాయన పుట్టింది పున్నమినాడే.

నా వ్యాఖ్యాన జీవితానికి

వరవడి దిద్దిన

# గురుదేవులకు

నమస్సులతో



వి. శ్రీరామశర్మ

6 - 3 - 596/21/2, వెంకటరమణకాలనీ

హైదరాబాదు - 4